'గడుస్తుందా ? ఏక్టీ, నాకు గడవటం లేదే; నేను కూడా కాలం గడ పాలను కుంటున్నాను !'

చున్నీలాలు కాసేపు అతని ముఖం వంక చూస్తూ ఉండి పోయాడు— అతని మనస్సులోసంగతులు ముఖాన్నిబట్టి తెలుసుకోవా లన్నట్టుగా ! తర్వాత—'దేవదాస్ ! అసలు వ్యవహార మేమిటో కాస్త చెప్పుతావా ?' అని అడిగాడు.

'ఏమీ లేదు ?'

'చెప్పవా ?'

'కాదు చున్నీ, చెప్పటానికేమీ లేదు.'

చున్నీ చాలాసేపు నేలవంక చూసి—'దేవదాస్ ! నా మాట ఒకటి నిలు పుతావా ?' అని అడిగాడు.

'ఏమిటి ?'

'అక్కడికి ఇంకోమాటు రావాలి, నేను మాట ఇచ్చాను.'

'ఆవాళ మనం వెళ్ళినచోటుకే కదూ ?'

'ఆc—'

'ఛీ, నాకు బాగుండదు.'

'నీకు బాగా ఉండేటట్టు నేను చేస్తానుగా.'

దేవదాసు కొంచెంసేపు అన్యమనస్కునివలె మాట్లాడకుండా ఉండి— 'సరే, వెళ్ళుదాము, పద !' అన్నాడు.

* * *

దేవదాసును అధోగతిలోకి ఒక మెట్టు క్రిందకు దించి చున్నీలాలు ఎటో తప్పుకుపోయాడు. దేవదాసు ఒక్కడే చంద్రముఖి గదిలో క్రింద కూర్చుని మద్యం తాగుతున్నాడు. చంద్రముఖి అతని దగ్గరనే కూర్చుని, విచారంతో అతని ముఖం వంక చూస్తూ 'దేవదాస్, ఇక త్రాగబోకు' అంది భయంతో

దేవదాసు గ్లాసు క్రిందపెట్టి ముఖం చిట్లించుకుని—'ఎందుకు' అన్నాడు.

'మద్యం అలవాటు చేసుకుని కొద్ది రోజులే అయింది. అంత ఎక్కువ భరాయించలేవు.'

'భరాయించటం కోసం కాదు నేను మద్యం త్రాగటం, ఇక్కడ ఉండ టానికే త్రాగుతున్నాను.'

ఈ మాట చంద్రముఖి అనేకసార్లు విని ఉన్నది. ఒక్కొక్కప్పుడు తల గోడకువేసి పగలగొట్టుకుని చద్దామని కూడా అనుకున్నది—దేవదాసును ఆమె ప్రేమించింది. దేవదాసు మద్యం గ్లాసు విసిరివేశాడు. అదిపోయి సోఫాకోటికి కొట్టుకొని చూరగమైపోయింది. తర్వాత దేవదాసు బాలీసు లావుక్కని పండు కుని తొట్రుపడుతున్న స్వరంతో చెప్పనారంభించాడు:—'నాకు లేచిపోయే సత్తువలేదు. అందుకనే ఇక్కడ కూర్చున్నాను. నాకు స్మృతి ఉండటం లేదు — అందుకనే నీముఖం వంక చూసి మాట్లాడ గలుగుతున్నాను. చం—ద—రా—ఇంకా నాకు పూర్తిగా తెలివి పోలేదు. కాస్త ఉన్నది— నిన్నంటుకోలేను. నీ వంటే నాకు పరమ అసహ్యం.'

చంద్రముఖి కళ్లు తుడుచుకొని, మెల్లగా—దేవదాస్ ! ఇక్కడికి ఎంతో మంది వస్తారు. కాని వాళ్లెవరూ మద్యం అంటుకోరు' అన్నది.

దేవదాసు కళ్లు విప్పుకుని లేచి కూర్చుని తడబడుతూ, చేతులు అటూఇటూ తిప్పుతూ—'అంటుకోరా ? నాదగ్గర తుపాకి ఉంటే వాళ్ళని కాల్చివేసే వాణ్ణి. వాళ్ళు నాకంటే కూడా పాపిష్టులు చంద్రముఖీ.' కొంచెం సేపాగి మళ్ళీ 'ఎప్పుడైనా తాగుడు వదలి పెట్టితే-అసలు వదలిపెట్టనులే-మళ్ళీ నేను నీ దగ్గరికి రాను. నాకు ఈ మాత్రమైనా దోవ కనపడుతున్నది, కాని వారి కేదీ ?' అన్నాడు.

కాసేపు ఆగి మద్యాన్ని సంబోధించి మళ్ళీ చెప్పనారంభించాడు :

'ఓ నా ఆపద్బంధువా ! నేను చాలా కష్టంలో ఉండి నిన్ను అలవాటు చేసుకున్నాను, నిన్ను నేను వదలిపెట్టను. వదలి పెట్టలేను.'

దేవదాసు బాలీసు మీద ముఖం రుద్ద నారంభించాడు — చంద్రముఖి తొందరగా అతని దగ్గరికి వచ్చి ముఖంపైకి ఎత్తింది. దేవదాసు ముఖం చిట్లించు కుని అన్నాడు :

'ఛీ, నన్ను అంటుకోబోకు. ఇంకా నాకు తెలివి ఉన్నది. చంద్రముఖీ ! నీకు బాగా తెలియదు—నాకు తెలుసును, నిన్ను నేను ఎంత అసహ్యించు

కుంటున్నదీ ? నిన్ను ఎప్పుడూ ఏవగిస్తాను. అయినా నీ దగ్గరికి వస్తాను, కూర్చుంటాను, మాట్లాడతాను. లేకపోతే నాకు గత్యంతరంలేదు: ఈ సంగతి నీకు అర్థమవుతుందా ? హా, హా, హా—ఎవరైనా, పాపం చీకట్లో తప్పు చేయరు, నేను ఇక్కడికి వచ్చి తాగుబోతు నవుతున్నాను, ఇంతకంటే మంచి చోటు ఈ ప్రపంచంలో ఇంకెక్కడ ఉన్నది. ఇక మీరంతా—'

దేవదాసు దృష్టిని కేంద్రీకరించి కాసేపు చంద్రముఖి విచారముఖంవంక చూసి—'అహా! సహనశక్తి నీలో ఉట్టిపడు తూంది. స్త్రీలు ఎంత అవమానమూ, తిరస్కారమూ, ఎన్ని అత్యాచారాలూ, ఉపద్రవాలూ సహించగలరో దానికి నువ్వే తార్కాణం!'

తర్వాత వెల్లికిల పండుకొని మెల్లగా అనుకోసాగాడు:

'చంద్రముఖంట, నన్ను ప్రేమిస్తున్నదంట !—నాకక్కర్లేదా ప్రేమ—అక్కర్లేదు. లేదంటేలేదు. నాటకాలు ఆడేవాళ్లను చూశాముగా, ముఖానికి నామూ మసీ పూసుకొని, దొంగలవుతారు—బిచ్చమెత్తుతారు—రాజులవుతారు—రాణీలవుతారు—ప్రేమిస్తారు—ఎన్నో ప్రేమ సంగతులు చెప్తూతారు—ఎంతో ఏడుస్తారు—అంతా నిజమయినట్టుగా! అలాగే చంద్రముఖి కూడా నాదగ్గర నాటకం ఆడుతున్నది, నేను చూస్తున్నాను... కాని నాకు దాని సంగతే జ్ఞాపకం వస్తూఉంటుంది. ఒక్క క్షణంలో అంతా అయిపోయింది. అది ఎటు వెళ్ళి పోయింది ? నేను ఎటు వచ్చేశాను ? ఇక నా జీవితానికంతకూ మంచి అభినయం ఆరంభమైంది. ఒకరు పక్కా తాగుబోతు, ఇంకొకతె—సరే, అదే కానీయి—అదేకానీయి—పోయేదేముంది ! ఆశ లేదు, భరవాసా లేదు, సుఖంలేదు, కోరికలేదు. వహ్వా ! అదేకానీయి !'

తర్వాత దేవదాసు ప్రక్కకు పొర్లి ఏమేమో గొణగ నారంభించాడు. చంద్రముఖికి ఏమీ అర్థం కాలేదు. కాసేపట్లో దేవదాసు నిద్రపోయాడు—అప్పుడు చంద్రముఖి దగ్గరకువచ్చి కూర్చున్నది. కొంగుతడిపి ముఖమంతా తుడిచి, తడిసిన దిండు మార్చింది. విసనకర్ర తీసుకొని కాసేపు విసిరి, చాలాసేపు తల వంచుకు కూర్చున్నది. రాత్రి ఒంటిగంట అయాక దీపం పెద్దచేసి, తలుపు దగ్గరకు లాగి ఇంకో గదిలోకి వెళ్ళిపోయింది.

దేవదాసూ, అతని అన్న ద్విజదాసూ, ఇంకా గ్రామస్తులు కొందరూ జమీందారు నారాయణ ముఖర్జీకి అగ్ని సంస్కారంచేసి ఇంటికి తిరిగివచ్చారు. ద్విజదాసు బిగ్గరగా ఏడుస్తూ ఉన్నాడు. అతని స్థితి పిచ్చివానిలాగా ఉన్నది. గ్రామస్తులు ఐదారుగురు కూడా అతన్ని పట్టుకుని ఆపలేకుండా ఉన్నారు. దేవదాసు శాంతంగా స్తంభానికి ఆనుకొని కూర్చున్నాడు. అతని నోట మాటా లేదు; కంట తడీ లేదు. ఎవ్వరూ వచ్చి అతన్ని పట్టుకోవటమూ లేదు—ఓదార్చాలనే ప్రయత్నమూ లేదు. మధుసూదన ఘోషు మాత్రం ఒకమాటు అతని దగ్గరికివచ్చి—'ఏమిచేస్తాం, నాయనా! నొష్ట రాసింది—' అంటూ ఏమేమో చెప్పబోయాడు, కాని దేవదాసు చెప్పనీ చెప్పకుండానే ద్విజదాసువంక వేలు చూపించి 'అక్కడ' అని అన్నాడు. ఘోషు మహాశయుడు అప్రతిభుడై—'అవును. వారికెంతో దుఃఖం—' అంటూ వెళ్ళిపోయాడు. ఇక ఎవ్వరూ అతని దగ్గరికి రాలేదు. రెండు ఝాము లయినాక దేవదాసు అర్ధ మూర్ఛితావస్థలో ఉన్న తల్లి దగ్గరికిపోయి కాళ్ళ దగ్గర కూర్చున్నాడు. ఆమెను చాలామంది స్త్రీలు చుట్టి ఉన్నారు. పార్వతి నాయనమ్మకూడా అక్కడనే ఉన్నది. ఆమె శోకాతురాలైన సద్యవిధవను భగ్న స్వరంతో సంబోధించి—'అమ్మాయీ! ఒకమాటు కళ్ళు తెరచి చూడు, దేవదాసు వచ్చాడు' అన్నది.

దేవదాసు—'అమ్మా' అని పిలిచాడు.

ఆమె ఒక్కమాటు కళ్ళు తెరచి — 'నాయనా' అన్నది. తర్వాత మూసిన కనుకొలకుల నించి కట్టతెగిన ప్రవాహంలాగ అశ్రుధార ప్రవహించింది. స్త్రీలు ఒక్కమాటుగా గొల్లుమని ఏడ్చారు. దేవదాసు కాసేపు తల్లి కాళ్ళ మీద తలపెట్టి, తర్వాత నెమ్మదిగా తండ్రి చనిపోయిన గదిలోకి పోయాడు. అతని కంట నీరు లేదు. శాంత-గంభీర మూర్తి. ఎర్రని కళ్ళతో పైవంక చూస్తూ నేలమీద కూర్చున్నాడు. అప్పుడు అతని వాలకం చూస్తే ఎవరైనా భయపడతారు. కణతల మీది నరాలు తాళ్ళవలె ఉబ్బినవి. సంస్కారం లేక వెంట్రుకలు నిక్కబొడుచుకున్నవి. దబ్బపండు వంటి శరీరం మీద సిరా పూసినట్టుగా ఉన్నది. కలకత్తాలోని అనాచారాలే కాక ఒక రాత్రల్లా జాగరణ చేశాడు; పైన తండ్రిచావు ఒక సంవత్సరం క్రిందట చూసినవా

శ్చైవరూ అతన్ని ఇప్పుడు చప్పున గుర్తించలేరు.

కొంచెం సేపయినాక పార్వతి తల్లి అతనిని వెతుకుతూ తలుపు తెరచుకొని లోపలికి వచ్చి—'దేవదాస్ !' అని పిలిచింది.

'ఏమి, అత్తయ్యా ?'

'ఇలా ఉంటే జరగదు, నా కునా !'

దేవదాసు ఆమెవైపుకు తిరిగి—'ఏం చేశాను అత్తయ్యా ?' అన్నాడు.

ఏమి చేసిందీ ఆమెకు తెలుసు. కాని జవాబివ్వలేకపోయింది. ఆమె దేవదాసు తలను దగ్గరికి తీసుకొని—'మా తండ్రివి కాదూ !' అన్నది.

'ఏమిటి అత్తయ్యా ?'

'మా బాబువి కాదూ !'

దేవదాసు ఆమె హృదయంలో తలపెట్టి ఒక అశ్రుబిందువు రాల్చాడు.

దుఃఖ పరివారాలకు కూడా కాలం గడుస్తుంది. క్రమంగా తెల్లవారింది. ఏడుపులూ మొత్తుకోళ్ళూ చాలవరకు తగ్గినవి. ద్విజదాసు ఒక్కమాటుగా మామూలు స్థితిలోకి వచ్చి వేశాడు. వాళ్ళ తల్లి కూడా లేచింది—కళ్ళు తుడుచుకుంటూ నిత్యకృత్యాలు చేసుకో నారంభించింది.

రెండు రోజులు గడిచినాక ద్విజదాసు తమ్ముణ్ణి పిలిచి—'దేవదాస్! తండ్రిగారి శ్రాద్ధానికి ఎంత ఖర్చు పెట్టటం మంచిది ?' అని అడిగాడు.

దేవదాసు అన్నముఖం వంక చూసి—'మీ కుచితమని తోచినంత'అన్నాడు.

'కాదు భాయీ ! ఇప్పుడు నా ఒక్కడి ఇష్టంతో పని జరగదు. నీవూ పెద్దవాడి వయావు. నీ అభిప్రాయం తెలుసుకోవడం కూడా అవసరం.'

'రొఖ్ఖం ఎంత నిలవున్నది ?'

'ఉమ్మడిని లక్షా యాభైవేలు ఉంటవి. పది పన్నెండు వేలు ఖర్చుపెట్టితే సరిపోతుందని నా ఉద్దేశం. ఏమంటావు ?'

'నాకెంత వస్తుంది ?'

ద్విజదాసు సంకోచిస్తూ—'ఆ, నీకూ సగం వస్తుంది. పది వేలు ఖర్చుపెట్టితే నీకో డెబ్బయి వేలూ నాకో డెబ్బయి వేలూ మిగులుతవి.

'మరి అమ్మకో ?'

'అమ్మ రోజుల్లో ఏమి చేసుకుంటుంది? ఈ ఇంటికి పెద్దతల ఆమే నాయె, మనమే పోషిద్దాం.'

దేవదాసు కాసేపు ఆలోచించి—'నీ వంతు అయిదు వేలు, నా వంతు ఇరవై అయిదు వేలు ఖర్చు పెడదాము. మిగతా యాభై వేలలో నేను పాతిక వేలు తీసుకుంటాను, శేషించిన పాతిక వేలూ తల్లిగారి పేర జమఉంటవి. మీ అభిప్రాయం ఏమిటి?'

మొదట ద్విజదాసు సిగ్గు పడ్డాడు. తర్వాత—'చాలా మంచి సంగతి. నాసంగతి తెలుసుగా-భార్యా, కొడుకులు, కూతుళ్లూ...వాళ్లకు చదువులూ, పెళ్ళిళ్ళూ-బోలెడు ఖర్చు పెట్టాల్సి ఉంటుంది. ఈ ఉద్దేశం బాగా నేఉన్నది.' అని కొంచెంసేపు ఆగి— 'సరే, కొంచెం రాసుకుంటే—' అన్నాడు.

'రాత కోతలవల్ల వచ్చేదేమున్నది—నలుగురిలో నగుబాటు తప్పితే? డబ్బు వ్యవహారం గోప్యంగా జరిగి పోవటమే మంచిదని నా ఉద్దేశం.'

'మంచిదే. కాని ఏ కాలానికి ఎలా ఉంటుందో—'

'సరే, నేను రాసిస్తాను.' అని దేవదాసు ఆ రోజునే కాగితం వ్రాసి ఇచ్చాడు.

మర్నాడు మధ్యాహ్నం దేవదాసు క్రిందకు దిగివస్తూ, పార్వతి మెట్లు ఎక్కి వస్తూ ఉండటం చూసి, ఆగి పోయాడు. పార్వతి అతన్ని చూసింది. ఆమెకు కొంచెం దుఃఖం కూడా కలిగింది. దేవదాసు ఆమె దగ్గరికి వచ్చి శాంత గంభీరస్వరంతో—'ఎప్పుడొచ్చావు పార్వతీ?'—అని అడిగాడు.

మూడు సంవత్సరాలు గడచినాక విన్నా అదే గొంతు!

పార్వతి తల వంచుకుని—'ఉదయమే వచ్చాను,' అన్నది.

'చాలా రోజుల నుంచి చూడటం పడలేదు. కులాసాగా ఉన్నావా?'

పార్వతి తల తిప్పింది.

'చౌదరిగారు బాగున్నారా? పిల్లా జల్లా అంతా క్షేమమా?'

'అంతా క్షేమమే.' అని పార్వతి ఒక మాటు దేవదాసు ముఖంవంక చూసింది. కాని అతను ఏ విధంగా ఉన్నదీ, ఏమి చేస్తున్నదీ ఒక్క ప్రశ్న కూడా అడగలేక పోయింది. అసలు నోటివెంట మాటే రాలేదు.

'ఇంకా కొన్నాళ్ళుంటావుగా?'

'ఆఁ.'

'అయితే ఇంకేం—' అని దేవదాసు బయటకు వెళ్ళిపోయాడు.

శ్రాద్ధం సక్రమంగా జరిగిపోయింది. దాని వివరాలు ఎత్తుకుంటే చాలా వ్రాయవలసి ఉంటుంది. అందుకని దాన్ని వదలివేస్తున్నాను. శ్రాద్ధం అయిన మర్నాడు పార్వతి ధర్మదాసును చాటుకు పిలిచి అతని చేతిలో బంగారపు గొలుసు పెట్టి—'ధర్మా, ఇది మీ అమ్మాయికి పెట్టుకో.' అని అన్నది.

ధర్మదాసు ఆమె వంక చూసి, అసలే తడిగా ఉన్న కళ్ళల్లో నీరు తెచ్చుకుని—'అహా! నిన్ను చూసి ఎంత కాలమైంది! అంతా క్షేమమేనా తల్లీ?' అని అడిగాడు.

'అంతా క్షేమమే. నీ పిల్ల లందరూ బాగున్నారా?'

'ఆఁ. బాగానే ఉన్నారు.'

'నువ్వు బాగున్నావా?'

ఈమాటు ధర్మదాసు ఒక నిట్టూర్పు విడిచి—'ఇంకా ఏం బాగు! వారు కూడా పోయారు. నేను కూడా దాటిపోతే బాగుంటుందని అనుకుంటాను.' అని ధర్మదాసు శోకావేశంలో ఏమేమో చెప్పబోతున్నాడు. కాని పార్వతి అడ్డు వచ్చింది. ఈ సంగతులన్నీ వింటానికి ఆమె హారం ఇవ్వలేదు.

'అదేమిటి ధర్మా, నువ్వు లేకపోతే దేవదాసును ఎవరు చూస్తారు?'

ధర్మదాసు తల బాదుకొని-'చిన్నవాడుగా ఉన్నప్పుడు ఎలానో చూశాను. ఇప్పుడు చూడకుండా ఉండటమే మంచిదిపారూ, బతికిపోతాము' అన్నాడు.

పార్వతి ఇంకా కొంచెం దగ్గరికి వచ్చి— 'ఒక్క సంగతి నాకు నిజం చెప్తావా, ధర్మా?' అని అడిగింది.

'ఎందుకు చెప్పను తల్లీ?'

'అయితే నిజం చెప్పు, దేవదా ఇప్పుడు ఏం చేస్తున్నాడు?'

'ఏం చేస్తాడు? నా తలకాయ!'

'విప్పి చెప్పు ధర్మా?'

ధర్మదాసు ఇంకోమాటు తల బాదుకుని—'ఇంకా ఏమి విప్పిచెప్పేది తల్లీ? అవన్నీ చెప్పే సంగతులా! ఇప్పుడు తండ్రి కూడా లేడు—చేతికి బోలెడు

డబ్బు వచ్చింది. ఈమాటు పట్టుపగ్గా లుంటువా ?' అన్నాడు.

పార్వతి ముఖం ఒక్కమాటుగా నల్లబడింది. వా డిచ్చిన సూచనల బట్టి ఆమె కొంత గ్రహించి, స్థబ్ధురాలై 'ఏమిటి నువ్వు చెప్పేది ధర్మాని' అన్నది.

మనోరమ వ్రాసిన ఉత్తరాన్ని బట్టి ఆమె ఇదివరకు కొంత తెలుసుకున్నది. కాని అప్పుడు నమ్మలేదు.

ధర్మదాసు తను చెప్పేది నిజమన్నట్టుగా తల తిప్పి, చెప్ప నారంభించాడు:

'తిండిలేదు, నిద్రలేదు, ఎప్పుడూ బుడ్లకు బుడ్లు బ్రాంది తాగుతూ ఉంటాడు. ఒకోమాటు నాలుగైదు రోజుల దాకా కనపడడు—ఎక్కడ పడి ఉంటాడో, అంతు తెలియదు. బోలెడు డబ్బు తగలేశాడు! ఎన్నో వేలవి నగలే చేయించాడని విన్నాను.' పార్వతి ఆపాద మస్తకమూ కంపించింది.

'ఈ సంగతి నిజమేనా ధర్మదాస్ ?' అని అడిగింది.

ధర్మదాసు వెనుకటి ధోరణిలోనే చెప్ప నారంభించాడు:

'బహుశా నీ మాట వింటా డనుకుంటాను. ఒకమాటు విచారించ కూడదూ? బంగారమంటి వళ్లు గుల్లయి పోయింది. ఇలా తిరుగుతూ ఇం కెన్నాళ్ళు బ్రతుకుతాడు? ఈ సంగతులు ఎవరికి చెప్పేది? తల్లీ, తండ్రీ, అన్నలకూ చెప్ప వల్ల కాదాయె!' అని ధర్మదాసు తల తపతప బాదుకుని— 'తల పగులగొట్టుకుని చావ బుద్ధేస్తున్నది, పాపూ. నాకు బతకాలనే కోరికే లేదు.' అన్నాడు. పార్వతి లేచి వెళ్ళిపోయింది.

నారాయణబాబు మరణవార్తవిని పార్వతి ఇక్కడకు పరుగెత్తు కొచ్చింది. ఈ అపత్సమయంలో దేవదాసు దగ్గరికి పోవటం ఉచితమని ఆమె తలచింది. కాని, ఆమెకు ప్రియ మైన దేవదా ఇక్కడ ఇలా అయిపోతున్నాడు! ఆమెకు ఎన్నో సంగతులు జ్ఞాపకం రా నారంభించినవి. దేవదాసుకంటే తన్నే ఆమె ఎక్కువ తిట్టుకున్నది. తానుంటే దేవదాసు ఇలా అయిపోయే వాడా? అని ఆమె లక్షసార్లు అనుకున్నది. పూర్వం ఆమె తన చేతో తాను ఉరితాడు మెడకు తగిలించుకున్నది. ఇప్పు డది బిగుసుకున్నది. దేవదాసు ఇక్కడ ఇలా పాడై పోతూ ఉంటే ఆమె పరుల కుటుంబం చక్క బెట్టటంలో నిమగ్నురాలై ఉంది! ఇక్కడ ఆమె సర్వస్వం తిండిలేకుండా

మాడిపోతూ ఉంటే— అక్కడ పరులు తన వారనుకుని అన్నదానం చేస్తూ ఉంది! ఇవ్వాళ ఆమె దేవదాసు కాళ్ళదగ్గర తల పగలగొట్టుకు చావాలని ప్రతిజ్ఞ చేసుకున్నది.

పొద్దు ఏటవాలింది. పార్వతి దేవదాసు గదిలో ప్రవేశించింది. దేవదాసు పక్కమీద కూర్చుని లెఖ్ఖలు చూసుకుంటున్నాడు. పార్వతి మెల్లగా తలుపువేసి నేలమీద కూర్చున్నది. దేవదాసు తలెత్తిచూసి నవ్వాడు. అతని ముఖం విచారంగా ఉన్నప్పటికీ శాంతంగా ఉన్నది. అతను హఠాత్తుగా— 'అపవాదు వే స్తే?' అన్నాడు కౌతుకంగా.

పార్వతి మాట్లాడలేదు. సిగ్గుపడింది. నల్ల కలువలవంటి నేత్రాలలో ఒక మాటు అతని వంక చూసి తల వంచుకున్నది. ఆ చూపులతోనే 'ఈ మాట నా హృదయంలో శూలంవలె ఎప్పటికీ గుచ్చుకున్నది. ఇంకా నన్నెందుకు హేళన చేస్తావు?' అని తెలిపింది. పార్వతి ఏమేమో చెప్పాలని వచ్చింది. కాని అంతా మరచిపోయింది. దేవదాసు దగ్గర ఆమె మాట్లాడలేదు. దేవదాసు మరల నవ్వుతూ—'నేను గ్రహించాను లేవే, గ్రహించాను! సిగ్గుపడుతున్నావు కదూ!' అన్నాడు.

పార్వతి అప్పటికీ మాట్లాడ లేక పోయింది. దేవదాసు మరల చెప్పనారంభించాడు.

'దానికింకా సిగ్గుపడటం ఎందుకూ? ఇద్దరం కలిసి ఏదో కుర్రతనం చేష్టలు చేశాము—కాని మధ్యలో రసాభాస అయింది. కోపంవచ్చి నీ నోటికి వచ్చింది నీ వన్నావు. నేనూ ముఖాన గురుపెట్టాను. ఏం బాగాలేదూ?'

దేవదాసు మాటలలో శ్లేష కానీ, వ్యంగం కానీ ఏ మాత్రమూ లేదు. ప్రసన్నుడై నవ్వుతూ నవ్వుతూ గడిచిపోయిన దుఃఖగాథ వినిపించాడు. కాని పార్వతి హృదయం పగిలిపోతూ ఉన్నది. ఆమె నోట గుడ్డ పెట్టుకుని, శ్వాస బిగబట్టి మనస్సులో—'ఈ మచ్చే నాకు ఓదార్పు దేవదా—నా మూలధనం! నీవు నన్ను చాల ప్రేమతో చూసేవాడివి, అందుకనే మన బాల్యచరిత్రను నా నొసట రాశావు. ఇది సిగ్గుచేటు కాదు. నాకు గౌరవ చిహ్నం!' అని అనుకున్నది.

'పారూ !'

పార్వతి నోటిమీదనుంచి గుడ్డ తియ్యకుండానే—'ఏమిటీ?' అని అడిగింది.

'నీమీద నాకు చాలా కోపం వస్తున్నది!' ఈమాటు దేవదాసు కంఠస్వరం కొంచెం మార నారంభించింది—'నాన్న గతించాడు. ఇప్పుడు నా కెంత కష్ట దినాలో చూడు; నువ్వుంటే నాకేమీ దిగులుండేది కాదు కదా! వదెన్ను నువ్వెరుగుదువు. ఇక అన్నయ్య స్వభావం నీకు తెలియందికాదు. అమ్మను ఏంచెయ్యమంటావో నీవే చెప్పు? ఇక నా సంగతా అగమ్యగోచరంగా ఉన్నది. నువ్వు ఉన్నట్లయితే నిశ్చింతంగా అంతా నీ చేతికి అప్పగించి.., అదేమిటి పారూ ?'

పార్వతి వెక్కి వెక్కి ఏడవసాగింది. 'ఏడుస్తున్నావా? అయితే ఈ ప్రసంగం ఇంతటితో కట్టిపెట్టాను.' అన్నాడు దేవదాసు.

పార్వతి కళ్ళు తుడుచుకుంటూ——'కాదు, చెప్పు.' అన్నది.

దేవదాసు ఒక్క క్షణంలో గొంతు మార్చుకుని—'పారూ, నువ్వు పక్కా ఇల్లాలి వయ్యావే!' అన్నాడు.

పార్వతి పెదవి కొరుక్కుని మనస్సులో——'ఇల్లాలు కాదు. మన్ను! గన్నేరుపూలు దేవుడి పూజకు పనికి వస్తాయా?' అని అనుకున్నది.

దేవదాసు పకపక నవ్వుతూ—'నాకు భలే నవ్వు వస్తుంది, పారూ! కాస్త దానివి, ఇప్పుడెంత పెద్దదాని వయావు? పెద్ద మేడా, పెద్ద జమీందారీ, పెద్ద పెద్ద పిల్లలూ-ఇంకా చౌదరిగారూ-అందరూ పెద్దవారే కాదు పారూ?' అని అడిగాడు.

పార్వతి మనస్సును రంజింపజేసే వాటిలో చౌదరిగారు కూడా ఒకరు. వారు తలపుకు రాగానే ఆమెకు నవ్వు వచ్చేది. అందుకనే ఇటువంటి దుఃఖంలో కూడా నవ్వు వచ్చింది.

దేవదాసు కృత్రిమ గాంభీర్యంతో—'ఒక సహాయం చేసి పెట్ట గలవా?' అని పార్వతిని అడిగాడు.

పార్వతి ముఖం ఎత్తి—'ఏమిటి?' అని అడిగింది.

'మీ దేశంలో మంచి పిల్లలు దొరుకుతారా ?'

పార్వతి నోట ఊట మింగి ఒకమాటు దగ్గి—'మంచి పిల్లా! ఎందుకు? ఏమి చేసుకుంటావు?' అని అడిగింది.

'దొరికితే పెళ్లి చేసుకుంటాను. ఒకమాటు సంసారిని కావాలని ఉన్నది.'

'మంచి చక్కనిది కావాలా?'

'అఁ. నీ మాదిరిది.'

'మెత్తనిది కూడానా?'

'మెత్తనిది లాభం లేదు. గడుసుది కావాలి! నీమాదిరిగా నాతో పోట్లాడాలి.'

పార్వతి మనస్సులో—'అలా ఎవరూ పోట్లాడలేరు, దేవదా! అలా పోట్లాడాలంటే నా మాదిరిగా ప్రేమించిన వారు కూడా కావాలి.' అని అనుకుని, పైకి—'ఇక నాసంగతే చెప్పు! నా వంటివాళ్ళు కొన్ని వేలమంది దొరుకుతారు, నువ్వు కావాలంటే' అన్నది.

దేవదాసు నవ్వుతూ—'ఏదీ పారూ! కనీసం ఒక్క పిల్లనైనా మాట్లాడిపెట్టు' అని అడిగాడు.

'నువ్వు నిజంగా పెళ్ళిచేసుకుంటావా, దేవదా?'

'చెప్పితినిగా—' అన్నాడు దేవదాసు.

కాని ఈ జీవితంలో నువ్వు మినహా నాకు ఏ స్త్రీమీదా కోరిక లేదని మాత్రం అతను విప్పి చెప్పలేదు.

'ఒక్క మాట అడగనా దేవదా!' అన్నది పార్వతి.

'ఒక్కటికాదు, లక్ష అడుగు.'

పార్వతి తన్ను తాను కొంత సంబాళించుకొని—'నువ్వు త్రాగుడు ఎందుకు నేర్చుకున్నావు?' అని అడిగింది.

'త్రాగటం కూడా నేర్చుకోవాలా?' అన్నాడు దేవదాసు నవ్వుతూ.

'అదికాదు; నువ్వు ఎందుకు అలవాటు చేసుకున్నావు?'

'ఎవరు చెప్పారు! ధర్మదాసా?'

'ఎవరైనా చెప్పనీ, నిజమా, అబద్ధమా?'

దేవదాసు దాచలేదు.—'కొంతవరకు నిజమే!' అన్నాడు.

పార్వతి కొంచెంసేపు స్తబ్ధురాలై కూర్చున్నది. తర్వాత—'ఎన్నివేలు పెట్టి నగలు చేయించి యిచ్చావు ?' అని అడిగింది.

దేవదాసు నవ్వుతూ—'ఇంకా ఇవ్వలేదు. చేయించి అట్టేపెట్టాను; నీకు కావాలా ?' అన్నాడు.

పార్వతి చెయ్యి చాపి—'ఇవ్వు, నా ఒంటిమీద ఒక్క నగకూడా లేదు.' అన్నది.

'చౌదరిగారు ఇవ్వలేదా ?'

'ఇచ్చారు. అవన్నీ వారి పెద్ద కూతురికి ఇచ్చాను.'

'నీకు అవసరమే లేదా ?'

పార్వతి తల అడ్డంగా తిప్పి ముఖం వంచుకున్నది. ఈ మాటు నిజంగా దేవదాసు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. ఎంతో దుఃఖంలో తప్ప స్త్రీలు తమ ఒంటిమీది నగలుతీసి ఇతర్ల కివ్వరని అతను గ్రహించాడు. కన్నీటిని ఆపుకుని ఉత్తదే పారూ ! నేను ఏ స్త్రీనీ ప్రేమించలేదు. ఎవ్వరికీ నగలివ్వలేదు' అన్నాడు దేవదాసు.

పార్వతి నిట్టూర్చి—'నాకూ అదే నమ్మకం.' అని మనస్సులో అనుకున్నది. చాలాసేపు నిశ్శబ్దంగా ఉన్నారు ఇద్దరూ. తర్వాత పార్వతి— 'ఇక మద్యం తాగనని ప్రతిజ్ఞ చెయ్యి.' అని అన్నది.

'అది నావల్ల కాదు. నువ్వు నన్ను ఒక్కమాటు కూడా తలచనని ప్రతిజ్ఞ చేయగలవా ?' అన్నాడు దేవదాసు.

పార్వతి మాట్లాడలేదు.

ఈ సమయంలోనే పూజాగృహంలో సాయంకాలపు జేగంటా; శంఖధ్వనీ వినిపించింది. దేవదాసు చకితుడై కిటికీలోనుంచి బయటకు చూసి—'చీకటి పడుతూ ఉంది ! ఇక ఇంటికి పో పారూ,' అన్నాడు.

'నేను పోను, నువ్వు ప్రతిజ్ఞ చెయ్యి !'

'నేను చేయలేను.'

'ఎందుకు చేయలేవు ?'

'అందరూ అన్ని పనులూ చేయగలరా ?'

'చేయదలచుకుంటే తప్పకుండా చేయగలరు.'

'నువ్వు ఈ రాత్రికి నాతో లేచి రాగలవా ?'

హఠాత్తుగా పార్వతి గుండె ఆగినట్టయింది. ఆమెకు తెలియకుండానే 'అదెలా సంభవం !' అని ఆమె నోటినుంచి వెలువడింది.

దేవదాసు మంచం మీద కొంచెం జరిగి కూర్చుని—'తలుపు తియ్యి పారూ!' అన్నాడు. పార్వతి లేచి తలుపుకు ఆనుకుని, అడ్డంగా కూర్చుని 'ముందు ప్రతిజ్ఞ చేయి !' అన్నది.

దేవదాసు లేచి నిలబడి, ధీర భావంతో—'పారూ, బలవంతాన ప్రతిజ్ఞ చేయించటం మంచిదా ? దానివల్ల ఏమన్నా లాభమున్నదా? ఇవ్వాళ చేసిన ప్రతిజ్ఞ రేపటికి ఉండదు. ఎందుకు నన్ను మిథ్యావాదిని కూడా చేస్తావు !'

తర్వాత చాలా సేపు నిశ్శబ్దంగానే గడచిపోయింది. గడియారం 'టంగ్, టంగ్' అని తొమ్మిది కొట్టింది. దేవదాసు వ్యాకులపాటుతో—'ఓ పారూ, తలుపు తెరవవే !' అన్నాడు. పార్వతి జవాబివ్వలేదు.

'ఓ పారూ !'

'నేను యిక్కడనుంచి కదలను !' అని పార్వతి ఆవేగాన్ని ఆపుకో లేక అక్కడే ఏడ్వ నారంభించింది. ఆమె చాలా సేపటివరకు ఏడుస్తూనే ఉన్నది. గదిలో కారు చీకటి-ఏమీ కనపడటం లేదు. పార్వతి నేలమీదపడి ఏడుస్తున్నదని మాత్రం దేవదాసు ఊహించి మెల్లగా—'పారూ !' అని పిలిచాడు.

'దేవదా, నాకు చాలా కష్టంగా ఉన్నది.' అని పార్వతి ఏడుస్తూనే అన్నది. దేవదాసు దగ్గరికి వచ్చాడు. అతని కంటా తడి ఉన్నది. కాని స్వరం మారలేదు—'ఆ సంగతి నాకు తెలియదటే పారూ !' అన్నాడు.

'దేవదా, నేను చచ్చిపోతున్నాను, నీకు నేనెప్పుడూ సేవచేయ లేక పోయాను—నా ఆ జన్మ వాంఛ—'

'దానికీ సమయం వస్తుంది.' అన్నాడు దేవదాసు ఆ చీకట్లో కళ్ళు తుడుచుకుంటూ.

'అయితే నాదగ్గరకురా. ఇక్కడ నిన్ను చూచేవారెవరూ లేరు.'

'నీ ఇంటికి వస్తే బాగా చూస్తావా ?'

'నాకు చిన్నప్పటినుంచీ ఉన్న కోరిక ఇదే. నా యీ కోర్కె నెరవేర్చు భగవంతుడా! తర్వాత చచ్చిపోయినా నాకు దిగులులేదు.' అన్నది పార్వతి భగవంతుని ఉద్దేశించి.

ఈమాటు దేవదాసు కళ్ళనుంచి కూడా బొట బొట నీళ్ళు కారినవి.

'మా ఇంటికి రా, దేవదా!' అని పార్వతి మళ్ళీ అడిగింది.

దేవదాసు కళ్ళు తుడుచుకుని—'సరే, అలాగే వస్తాను.' అన్నాడు.

'నన్ను తాకి చెప్పు, వస్తావా?'

దేవదాసు ఆ చీకట్లో ఊహించి, పార్వతి పాదాలను అంటుకుని 'ఈ మాట ఎప్పటికీ మరచిపోను. నాకు సేవచేస్తే నీ దుఃఖం తగ్గిపోయే టట్టయితే నేను తప్పక వస్తాను. చనిపోయేముందు కూడా నాకీమాట తప్పక జ్ఞాపకం ఉంటుంది.' అని అన్నాడు.

*　　　*　　　*

తండ్రి చనిపోయిన తర్వాత దేవదాసు ఆరుమాసాలదాకా ఇల్లు కదలలేదు. అతనికి ఏకాంత జీవనం అంటే విసుగెత్తిపోయింది. సుఖం లేదు శాంతి లేదు. పైన ఎప్పుడూ పార్వతి చింత. ఏపని చేద్దామన్నా పార్వతే జ్ఞాపకం వస్తూ ఉంటుంది. ఇక అన్న ద్విజదాసూ, భర్తగారి అడుగు జాడల్లో నడిచే వదినా, దేవదాసును ఇంకా విసిగించారు. అతని తల్లి స్థితి కూడా ఇలానే ఉన్నది. భర్తచావుతో ఆమె సుఖాలన్నీ తుడుచుకు పోయినవి. పరాధీనంగా ఈ ఇంట్లో ఉండటం ఆమెకు క్రమంగా అసహ్యం వేసిపోయింది. కొన్నాళ్ళ నుంచీ ఆమె కాశీ వెళ్ళాలని అనుకొంటోంది. దేవదాసుకు పెళ్లి చేయకుండా ఎలా వెళ్ళడమా అనే ఆగింది. 'పెళ్ళిచేసుకో దేవా! నేను చూసిపోతా'నని ఆమె చాలా సార్లు చెప్పింది కూడా. కాని దానికి ఒక ఇబ్బంద ఉన్నది. ఇంకా ఏటినూతకం వెళ్లలేదు. పైగా అతనికి నచ్చినపిల్ల దొరకాలి. పార్వతిని ఎందుకు చేయక పోతినా? అని ఇప్పుడిప్పుడామె విచారిస్తూ ఉన్నది. ఒకనాడు దేవదాసును పిలిచి—'ఇక, ఇక్కడుండ లేను దేవా! కొన్నాళ్ళ పాటు కాశీ వెళ్తాను.' అని చెప్పింది.

దేవదాసు ఉద్దేశం కూడా ఇదే—'నేనుగూడా అదే చెప్పుదా మనుకుంటు

స్తాను. ఈ ఆరుమాసాలుండి వస్తే సరిపోతుంది.' అన్నాడు దేవదాసు.

'ఆఁ-అలాగే చేయి నాయనా! సంవత్సరీకం అయ్యాక నీ పెళ్ళిచేసి, నీ సంసారం చూచి మళ్ళీ నిశ్చింతగా నేను కాశీ వెళ్తాను.'

దేవదాసు తల్లిని కాశీలో వదిలిపెట్టి తను కలకత్తా వచ్చాడు. కలకత్తా వచ్చి నాలుగైదు రోజులు చున్నీలాలుకోసం తిరిగాడు. అతను కనపడలేదు. బసమార్చివేశాడట. ఒకనాటి సాయంత్రం దేవదాసుకు చంద్రముఖి జ్ఞాపకం వచ్చింది. ఒకమాటు చూడగూడదా? అనుకున్నాడు. ఇన్నాళ్లనుంచీ ఆమె జ్ఞాపకమే రాలేదు. దేవదాసు కొంచెం సిగ్గుపడ్డాడు కూడా. బాడుగబండి మాట్లాడుకుని చంద్రముఖి ఇంటి ముందుకు వచ్చి ఆగాడు. చాలాసేపు కేకలు వేసిన మీదట—'ఇక్కడ లేదు.' అని ఎవరో ఆడమనిషి జవాబిచ్చింది.

ఇంటికెదురుగా లాంతరు స్తంభం ఉన్నది. దేవదాసు దాని దగ్గరకు వచ్చి 'ఎక్కడికి వెళ్ళిందో చెప్పగలవా?' అని మళ్ళీ అడిగాడు.

ఇంట్లో ఉన్న మనిషి కిటికి తలుపు తెరచి, కొంచెంసేపు అతనివంక నిదానించిచూసి 'నువ్వు దేవదాసువా?' అని అడిగింది.

'ఆఁ.'

'ఆగు—తలుపు తెరుస్తాను.' అనివచ్చి తలుపుతీసి 'రండి' అని పిలిచింది. దేవదాసుకు గొంతు ఎగిరిన దానిలాగానే కనిపించింది. కాని గుర్తించలేక పోయాడు; పైగా చీకటి కూడా పడింది—'చంద్రముఖి ఎక్కడ ఉందో చెప్పగలవా?' అని అడిగాడు.

స్త్రీ మందహాసం చేస్తూ—'పైకి రండి చూపిస్తాను.' అన్నది.

దేవదాసు ఈమాటు గుర్తించి—'నీవా?' అన్నాడు.

'ఆఁ, నేనే నన్ను బొత్తిగా మరిచి పోయారా?'

దేవదాసు పైకి వచ్చాడు. చంద్రముఖి నల్లకమ్ముల సాదాచీర కట్టుకుని ఉన్నది. చీరె మాసింది. చేతిని గాజులు మాత్రం ఉన్నవి; ఇక ఒంటి మీద ఒక్క నగకూడా లేదు. కొన్నాళ్ళ నుంచి తల దువ్వుతున్న లక్షణాలేవీ ఆమెలో కనిపించలేదు. దేవదాసు విస్మయంతో—'నువ్వేనా!' అని తర్వాత పరీక్షగా చూశాడు. చంద్రముఖి వెనకటికంటే చాలా కృశించి పోయింది.

'నీ కేమైనా జబ్బు చేసిందా?' అని దేవదాసు అడిగాడు.

చంద్రముఖి నవ్వుతూ—'శారీరకంగా ఏమీ లేదు. మీరు కాస్త తీరికగా కూర్చోండి' అన్నది.

దేవదాసు మంచంమీద కూర్చున్నాడు. గది అంతా మారిపోయింది. యజమానురాలికి మల్లే దాని ముఖాన కూడా దౌర్భాగ్య చిహ్నాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. బెర్లూ, టేబిలూ. అలమారు—వగైరాలు పెట్టేచోటు ఖాళీగా ఉన్నది. ఒక్క సామాను కూడా లేదు. మంచంమాత్రం ఉన్నది. దానిమీద పరచిన గుడ్డ కూడా, మాసింది. గోడల మీద ఒక్క చిత్రం కూడా లేదు; ఇంకా మేకులు మాత్రం ఉన్నాయి. వాటికి కట్టిన ఎర్రత్రాళ్ళు కూడా వేలాడుతూనే ఉన్నాయి. గడియారం గోడనే ఉన్నది; కాని ఆడటం లేదు. దానిచుట్టూ సాలీళ్లు జాలరు అల్లినవి. గదిలో ఒక మూలను ఆముదం దీపం వెలుగుతూ ఉన్నది. దాని సహాయంతోటే దేవదాసు ఈ కొత్త అలంకరణ చూశాడు. అతనికి విస్మయంతోపాటు కొంచెం కోపంకూడా వచ్చింది.

'ఇలాంటి దుస్థితి ఎలా సంభవించింది, చంద్రా?' అని అడిగాడు.

చంద్రముఖి మ్లానంగా నవ్వి — 'ఇది దుస్థితి అని ఎవరు చెప్పారు? నాభాగ్యం పండింది.' అన్నది.

దేవదాసుకు ఏమీ అర్థం కాలేదు.—'నీ ఒంటిమీద నగలన్నీ ఏమయినై?' అని అడిగాడు.

'అమ్మేశాను.'

'సామాను?'

'అదికూడా అమ్మాను?'

'పటాలుకూడా అమ్మావా?'

చంద్రముఖి నవ్వుతూ, ఎదురుగా ఉన్న ఇల్లు చూపించి—'ఆ ఇంట్లో ఉండే క్షేత్రమణి కిచ్చాను.' అన్నది.

దేవదాసు కొంచెంసేపు ఆమె ముఖంవంక చూసి—'చున్నీబాబు ఎక్కడ?' అన్నాడు.

'నాకు తెలియదు. రెండు మాసాల క్రిందట పోట్లాడి వెళ్ళిపోయాడు.'

దేవదాసుకు ఇంకా ఆశ్చర్యం కలిగింది- 'పోట్లాడటం ఎందుకు?' అన్నాడు.

'ఇక పోట్లాటలే రావా?'

'వస్తవి. కాని ఎందుకు వచ్చిందా అని?'

'నేరం కుదర్చటానికి వస్తే వెళ్ళగొట్టాను.'

'ఏమి నేరం?'

'పశువుల నేరం!' అని చంద్రముఖి నవ్వి—'మీకు అర్థం కాలేదా? ఒక షాహుకారును పట్టుకొచ్చాడు. నెలకు రెండువందల రూపాయలు; ఒంటి నిండా నగలు; కొసుయు, వాకిట్లో బట్రోతు; తెలిసిందా?' అన్నది.

దేవదాసు అర్థంచేసుకొని—'ఏవీ, ఆ లక్షణాలేవీ కనపడవే?' అన్నాడు నవ్వుతూ.

'ఉంటే మీకు కనపడేవే. నేను వాళ్ళను వెళ్ళగొట్టాను.'

'వాళ్ళ అపరాధం?'

'అంత గొప్పది కాదు. నాకే ఇష్టం లేకపోయింది.'

దేవదాసు కాసేపు ఆలోచించి—'అప్పటినుంచీ ఇంకెవ్వరూ రాలేదా?' అని అడిగాడు.

'అప్పటినుంచేం? మీరు వెళ్ళిన మర్నాటినుంచీ ఎవ్వరూ రాలేదు. చున్నీ మాత్రం ఎప్పుడన్నా వచ్చి కూర్చునేవాడు. రెండు మాసాలనుంచి అతను కూడా రావటం లేదు.'

దేవదాసు మంచంమీద పండుకున్నాడు; కాసేపు అన్యమనస్కంగా ఉండి —'అయితే వ్యాపారమంతా ఎత్తేసినట్టేనా, చంద్రముఖీ?' అని అడిగాడు.

'అం—దివాళా తీసింది!'

'మరి నీ పొట్ట గడవటం ఎలా?'

'ఇంతకు ముందే చెప్పానుగా, నగల లమ్మానని.'

'ఎన్ని రూపాయలొచ్చినై?'

'ఎక్కువలేదు. ఏడెనిమిది వందలున్నాయి. అవి ఒక షరాబు దగ్గర అట్టిపెట్టాను. నెలకు ఇరవైరూపాయల చొప్పున ఇచ్చే ఏర్పాటు.'

'ఇరవైరూపాయలతో వెనక నీవు గడిచేది కాదుగా ?'

'ఊహుఁ. ఇప్పుడూ గడవటం లేదు. మూడు నెలల అద్దెకూడా బాకీ ఉన్నది. అందుకనే, చేతులగాజులమ్మి ఎటన్నా వెళ్లుదా మనుకుంటున్నాను.'

'ఎక్కడికి వెళ్తావు ?'

'ఇంకా స్థిరపరచుకోలేదు. ఏదన్నా పల్లెటూరు—ఇరవైరూపాయలతో గడిచేచోటికి ఎక్కడికైనా.'

'మరెందుకు వెళ్ళలేదు? నీ కేదో ప్రయోజనం లేకపోతే ఇన్నాళ్ళనుంచీ వృథాగా అప్పెందుకు పెంచావు?'

చంద్రముఖి తలవంచుకొని ఆలోచనలోపడింది. ఆమె తన జీవితంలో మాట్లాడటానికి సిగ్గుపడటం ఇదే మొదటిసారి.

'మాట్లాడవేం ?' అన్నాడు దేవదాసు.

చంద్రముఖి మంచంమీద ఒక ప్రక్కన ఒత్తుకు కూర్చుని మెల్లగా చెప్ప నారంభించింది :—'కోప్పడకండి, వెళ్లేముందు మిమ్మల్ని ఒక మాటు చూసి పోదామని ఆగాను. మీరు తప్పక వస్తారనే నమ్మకం నా కున్నది. ఇవ్వాళ వచ్చారు. ఇక నేను రేపే వెళ్ళిపోవటానికి ప్రయత్నిస్తాను. ఎక్కడికి వెళ్తానో చెప్పమంటారా ?'

దేవదాసు విస్మితుడై లేచి కూర్చున్నాడు :—'ఊరక చూడాలనేనా ! ఎందుకు ?'

'అదొక ఖర్మ్యాళి. నేనంటే మీరు అసహ్యించుకుంటారు. ఇంతగా నన్నెవ్వరూ ఎప్పుడూ అసహ్యించుకోలేదు—బహుశా అందుకే ననుకుంటాను. ఆనాటి సంగతి మీ కిప్పుడు జ్ఞాపకమున్నదో లేదో తెలియదు, కాని నాకు బాగా జ్ఞాపకం ఉంది, మీరు మొట్ట మొదట వచ్చిన రోజునే నన్ను అక రించారు. మీరు ధనికుల బిడ్డలని కూడా నాకు తెలుసును. కాని మీధనం నన్నాకర్షించ లేదు. మీకు పూర్వం ఇక్కడకు 'ఎంతోమంది' వచ్చారు, పోయారు. కాని వారి ఒక్కరిలోగూడ నాకు తేజస్సు కనిపించలేదు. మీరు రాగానే నన్ను గాయపరచారు. నేను అనుకోని విధంగా, నాతో అతి మోటుగా వ్యవహరించి, అసహ్యించుకుని ముఖం తిప్పుకున్నారు. చివరకు

తమాషాగా డబ్బు పారవేశారు—ఇవన్నీ మీకు జ్ఞాపకం ఉన్నాయా ?'

దేవదాసు మాట్లాడలేదు. చంద్రముఖి మరల చెప్ప నారంభించింది :

'అప్పటినుంచీ నేను మీమీద ఒక కన్నుంచాను ; ప్రేమించీ కాదు, ద్వేషించీ కాదు ; ఒక చిత్రమైన వస్తువును చూస్తే మనకు ఎలా జ్ఞాపకం ఉంటుందో, అలానే నేను మిమ్మల్ని మరచిపోలేక పోయాను. మీరు వస్తే నేను చాలా భయంతోనూ, జాగ్రత్తగానూ మెలగేదాన్ని. కాని రాకపోతే మాత్రం ఏమీ తోచేది కాదు. తర్వాత నాకేమి మతిభ్రమ వచ్చిందో తెలియదు —ఈ కళ్ళతో ప్రతి విషయాన్నీ ప్రతి వస్తువునూ ఇంకో దృష్టితో చూడ నారంభించాను. నాలో ఉన్న పూర్వపు 'నేను' పోయి కొత్త 'నేను' వచ్చింది. ఆ తర్వాత మీరు త్రాగుడు అలవాటయ్యారు. మద్యమంటే నాకు తగనిరోత ; త్రాగుబోతును చూస్తే నాకు మండిపోయేది. అదేమి ఖర్మమో మిమ్మల్ని చూస్తే నాకు కోపం వచ్చేది కాదు. తాపం వచ్చేది' అని చంద్రముఖి దేవదాసు కాళ్ళమీద చేతులుపెట్టి బొట బొట కన్నీళ్ళు కారుస్తూ— 'నేను చాలా అధమురాలిని, నా తప్పులు లెఖ్ఖచేయకండి. నేనంటే మీరు దూరంగా ఉండేవారు—తిట్టేవారు, చీదరించుకు నేవారు. కాని మీరు ఎంత చీదరించుకుంటే అంత దగ్గరకు రావా లనుకు నేదాన్ని. ఆఖరికి నిద్రపోయాక—పోనీయండి. ఆసంగతి చెప్పితే మీకు కోపం వస్తుంది.' అన్నది.

దేవదాసు ఏమీమాట్లాడలేదు. ఈ కొత్తరకం మాటలు అతనికి వేదన కలిగిస్తున్నాయి. చంద్రముఖి చాటుగా కళ్ళు తుడుచుకుని మరల చెప్పసాగింది:

'ఒక రోజున మీరన్నారు జ్ఞాపకమున్నదా—'మీరు ఎంత అవమానమూ, అత్యాచారమూ, ఉపద్రవమూ, తిరస్కారమూ సహిస్తా' రని ! అప్పటినుంచీ నాకు అభిమానం పుట్టుకొచ్చింది. ఈ వృత్తి అంటే అసహ్యం వేసింది.'

దేవదాసు లేచి కూర్చుని—'మరి నీపొట్ట గడిచే దెలా ?' అని అడిగాడు.

'ఆ సంగతి ఇందాకనే చెప్పాను.'

'ఒకవేళ వాడు డబ్బు ఎగవేస్తే—'

చంద్రముఖి భయపడలేదు. చాలా శాంతంగానూ సహజంగానూ అంది :

'అలా జరిగినా ఆశ్చర్యం లేదు. అలాంటి అవాంతరం వస్తే మిమ్మల్ని యాచిద్దా మనుకున్నాను.'

దేవదాసు కొంచెం ఆలోచించి — 'అలాగే తీసుకో. ఇక నువ్వెక్కడికన్నా వెళ్ళే ప్రయత్నాలు చెయ్యి.' అన్నాడు.

'రేపే వెళ్తాను. గాజులు అమ్మి, ఒకమాటు వరాలును కలుసుకోవాలి.'

దేవదాసు జేబులోనుంచి వందరూపాయల కాగితం తీసి దిండుక్రింద పెట్టి 'గాజులు అమ్మకోకు, వరాలును మాత్రం కలుసుకో. అయితే ఎక్కడికి వెళ్తావు ? ఏదన్నా తీర్థానికా ?' అన్నాడు.

'ఊహుం ! తీర్థాలమీద నాకు నమ్మకం లేదు! కలకత్తాకు ఎక్కువ దూరం కూడా పోను; దగ్గరలో ఏదన్నా పల్లెటూరులో ఉంటాను.'

'ఎవరింట్లో నన్నా దాసీపని చేస్తావా ?'

చంద్రముఖి కళ్ళల్లో నీరు తిరిగింది. కళ్ళు తుడుచుకుని— 'నాకిష్టం లేదు. స్వతంత్రంగా ఉంటాను. అస లెందుకు శ్రమపడాలి? శరీరకష్టం నే నెప్పుడూ చేయలేదు—ఇప్పుడూ చేయలేను. ఎక్కువ పీకులాడితే ఈ పుల్లలు కాస్త రాలి పోతవి.' అన్నది.

దేవదాసు విషణ్ణముఖంతో మందహాసం చేశాడు.

'పట్నానికి దగ్గరగా ఉంటే ప్రలోభాలు ఎక్కువవుతవిగా ? మనస్సును నమ్మకూడదు !' అన్నాడు.

ఈ మాటకు చంద్రముఖి ముఖం వికసించింది. నవ్వుతూ—'ఆమాట నిజమే. మానవుని మనస్సు విశ్వసించకూడదు. కాని నే నలాంటి ఎరలకు చిక్కను. స్త్రీలకు ప్రలోభాలు ఎక్కువని నేనూ ఒప్పుకుంటాను. కాని అవన్నీ నేను స్వేచ్ఛగా వదులుకున్నప్పుడు నాకింకా భయమేముంది? హఠాత్తుగా ఏదన్నా ఉద్రేకంలో వదులుకున్నట్టయితే, నేను జాగ్రత్తపడాల్సి ఉండేది. ఇన్నాళ్ళనుంచీ నేను ఒక్కనాడు కూడా పశ్చాత్తాప పడలేదు! సుఖంగా ఉన్నాను.'

దేవదాసు నమ్మనట్టుగా తల తిప్పుతూ—'స్త్రీల మనస్సు చాలా చంచలం —నమ్మదగింది కాదు' అన్నాడు.

ఈ మాటు చంద్రముఖి బాగా దగ్గరికి వచ్చి కూర్చుని, అతని చేతులు

రెండూ పట్టుకుని—'దేవదాస్ !' అన్నది.

దేవదాసు ఆమె ముఖంవంక చూశాడు. కాని ఈ మాటు — 'నన్ను ముట్టుకోవద్దని అనలేక పోయాడు.

చంద్రముఖి స్నేహ విస్ఫారిత నేత్రాలతో అతనివంక చూస్తూ, చేతులు రెండూ దగ్గరికి లాక్కుని, కంపితస్వరంతో అన్నది:

'ఇది ఆఖరిరోజు, ఇవ్వాళ నన్ను కోప్పడకండి! ఒక్కమాట మిమ్మల్ని అడగాలని నాకు చాలా కుతూహలంగా ఉన్నది'—అని ఒక్క క్షణం రెప్ప వాల్చకుండా దేవదాసు ముఖంవంక చూసి—'పార్వతి మిమ్మల్ని మోసం చేసిందా!' అన్నది.

'నీ కెందు కా సంగతి?' అని దేవదాసు కనుబొమ్మలు చిట్లించాడు.

చంద్రముఖి తొణకలేదు, శాంత దృఢ స్వరంతో అన్నది:

'నా కవసరం ఉన్నది. నేను నిజం చెప్పుతున్నాను—మీరు కష్టపడుతూ ఉంటే నాకు ఎలానో ఉంటుంది. ఇంతేగాక, మీ సంగతులు నాకు చాలా తెలుసు ననుకుంటాను. కైపులో ఉండగా మీరు అనేక సంగతులు వెల్లడించే వారు. కాని వాటినిబట్టి చూస్తే పార్వతి మిమ్మల్ని మోసగించినట్టు నాకేమీ నమ్మకం కలగలేదు. పైగా మిమ్మల్ని మీరే మోసపుచ్చుకున్నట్లు తోచేది. నేను మీకంటె పెద్దదాన్ని. బోలెడు ప్రపంచం చూసిన దాన్ని. అప్పుడు నేనే మనుకునేదాన్నో ఎరుగుదురా? మీదే పొరపాటని అనుకునేదాన్ని. స్త్రీలు చంచల చిత్తలనీ, స్థిరత్వంలేనివారనీ ప్రఖ్యాతి. నిజానికి, వారంత అపకీర్తికి తగిన వారు కారని నా ఉద్దేశం. కీర్తి తెచ్చినా అపకీర్తి తెచ్చినా మీరే. మీరు అనదలచిం దేమిటో అనాయాసంగా అనేస్తారు. వారలా అనలేరు. తమ మనస్సులోని మాట వెల్లడించలేరు. అథవా వెల్లడించినా ఎవ్వరూ గ్రహించలేరు. ఎందుకంటే, అది చాలా అస్పష్టంగా ఉంటుంది—మీ నోళ్ళ ముందు అణగిపోతుంది. ఇక అపకీర్తి మాత్రమే లోకు లందరికీ వినిపిస్తుంది.'

చంద్రముఖి కొంచెం ఆగి గొంతు సవరించుకుని చెప్ప నారంభించింది:

'ఈ జీవితంలో నేను ప్రేమ వ్యాపారం చాలాకాలం చేశాను. కాని ఒక్కమాటు మాత్రమే ప్రేమించాను. ఆ ప్రేమకు చాలా విలువకూడా

ఉన్నది! ఎరుగుదురా? ప్రేమ వేరు; రూపమోహం వేరు. వీటిల్లో చాలా తికమక ఉంది. ముఖ్యంగా పురుషులే చాలా తికమకపడుతూ ఉంటారు. రూప—మోహం మీకంటే మాకు చాలా తక్కువ; మనిషిని చూడగానే మేము ఉన్మత్తలం కాము. మాదగ్గరికి వచ్చి మీరే ప్రేమను ఎన్నో రకాల హావభావాలతో వ్యక్తంచేస్తారు. మేమేమీ మాట్లాడము. మీ మనస్సును కష్టపెట్టటానికి మాకు సిగ్గూ, సంకోచమూ, దుఃఖమూ అడ్డువస్తూ ఉంటయి. మీ ముఖం మాకు అసహ్యం వేస్తున్నా, మిమ్మల్ని మేము ప్రేమించటం లేదని చెప్పలేము; కారణం సిగ్గు అడ్డు పడుతూ ఉంటుంది. ఇక ప్రణయాభినయం ఆరంభమౌతుంది. తర్వాత కొన్నాళ్ళకైనా అసలు సంగతి బయట పడక మానదు. అప్పుడు మీరు కోపంతో అసిరులై—'విశ్వాస ఘాతకి!' అంటారు. అందరూ అదే వింటారు. నమ్ముతారు కూడా. మేము అప్పటికీ మౌనంగానే ఉంటాము. మా మనస్సు ఎంతో కష్టపడుతుంది. కాని అ దెవరు చూస్తారు?'

దేవదాసు మాట్లాడలేదు. చంద్రముఖి కాసేపు మాట్లాడకుండా అతని ముఖం వంక చూస్తూ ఉన్నది; తర్వాత మరల చెప్ప నారంభించింది:

'ఆ సమయాన మా మనస్సులో కొంచెం మమత కలిగినా కలగవచ్చు, స్త్రీలు దాన్నే ప్రేమ అనుకుంటారు; వారు శాంతంగానూ స్థిరంగానూ ఇంటి పనులు చేసుకుంటూ మీ కష్టాలకు ఆదుకొంటూ ఉంటే—ఓ, మీరు వాళ్లని ఎంత పొగుడుతారు! ఎంత ఆదర్శంగా చెప్పుకుంటారు! కాని ఆ సమయంలో వాళ్ళకు బహుశా ప్రేమంటే ఏమిటో కూడా తెలియదు. తర్వాత వారి హృదయం తీరని వేదనతో తపించి, ఏదన్నా అశుభ ముహూర్తాన ఇల్లు వదలిపెట్టితే అప్పుడు—' అని ఆమె దేవదాసు ముఖం వంక తీవ్రంగా చూసి—'అప్పుడు మీరు 'కళంకిని' అని చీత్కారం చేస్తారు! ఛీ, — '

దేవదాసు చప్పున చంద్రముఖి నోరు మూసి—'అదేమిటి చంద్రముఖీ?' అన్నాడు.

చంద్రముఖి నెమ్మదిగా చేయి తీసివేసి—'భయపడకు దేవదాస్! నేను మీ పార్వతి సంగతి చెప్పటం లేదు' అని ఊరుకున్నది.

దేవదాసు కాసేపు మాట్లాడకుండా ఊరుకుని, అన్యమనస్కుడిమాదిరిగా

'కాని కర్తవ్యం అనేది ఒక టున్నదిగా! ధర్మాధర్మాలు ఉన్నైగా' అన్నాడు.

'ఎందుకు లేవు! అందుకనే, దేవదాస్! నిజంగా ప్రేమించిన వారు అన్నీ సహించి ఉంటారు. అంతరంగంలో ప్రేమించినంత మాత్రంచేతనే ఎంత సుఖం ఎంత తృప్తికలుగుతుందో గ్రహించినవాళ్లు అనవసరంగా కుటుంబాల్లోకలవరం తీసుకురారు. ఊం. నేను ఏమి చెప్పుతున్నానూ?—పార్వతి మిమ్మల్ని ఎంత మాత్రం మోసపుచ్చలేదు. మిమ్మల్ని మీరే వచించు కున్నారని నాకు గట్టి నమ్మకం. కాని, ఈ సంగతి ఇప్పుడు మీరు గ్రహించలేరు. దాని సమయం వచ్చినప్పుడు మాత్రం నేను నిజం చెప్పానని మీరు తప్పక అనుకుంటారు.'

దేవదాసు కళ్లు నీటితో నిండిపోయినవి. ఇవ్వాళే అతనికి చంద్రముఖి మాటలే సత్యంగా తోచ నారంభించినవి. చంద్రముఖి కన్నీరు చూసింది. కాని తుడవ ప్రయత్నించలేదు. మనస్సులో అనుకోసాగింది :

'నేను అనేకసార్లు అనేక విధాలుగా మిమ్మల్ని చూశాను. మీ మనస్సు నేను ఎరుగుదును. సామాన్య పురుషులవలె మీరు మీ ప్రేమను వెల్లడించరని కూడా నాకు తెలుసును; ఇక రూపం సంగతి! రూపాన్ని ఎవరు ప్రేమించరు? కాని, కేవలం రూపంకోసం మీరు మీ తేజాన్ని బలి ఇస్తారని నాకు నమ్మకం కలగటం లేదు. పార్వతి అందకత్తె కావచ్చును. కాని, మిమ్మల్ని ప్రేమించానని ఆమే ముందుగా మీకు తెలిపిందని నాకు తోస్తున్నది.'

ఇలా అనుకొంటూ ఉండగా హఠాత్తుగా ఆమె నోటి నుంచి—'నన్ను బట్టి గ్రహించుకున్నాను, ఆమె మిమ్మల్ని ఎంతగా ప్రేమించిందో!' అని అస్పష్టంగా వెలుపడింది.

దేవదాసు చప్పున లేచి కూర్చుని—'ఏమన్నావు ?' అని అడిగాడు.

'ఏమీలేదు. ఆమె మీ అందంచూచి భ్రమపడ లేదంటున్నాను. మీకు అందం ఉన్నదికాని, దాన్ని చూసి ఎవరూ మోసపోరు. ఇక మీ తీవ్ర కటు రూపం అందకీ కనపడదు ; కాని చూచినవారు మాత్రం దాని నుంచి దృష్టి మళ్ళించుకో లేరు' అని చంద్రముఖి నిట్టూర్చి — 'మీలో ఎంత ఆకర్షణ ఉన్నదో మిమ్మల్ని ప్రేమించిన వారికే తెలుస్తుంది. ఈ స్వర్గాన్ని తనకై తాను వదలుకునే స్త్రీ ప్రపంచంలో ఉన్నదా?' అన్నది.

తర్వాత కొంతసేపు మౌనంగా అతని ముఖంవంక చూసి మరల చెప్పసాగింది:

'ఈ రూపం కళ్ళకు కనపడదు! కాని, దీని ఛాయ మాత్రం హృదయం మీద పడుతుంది—'

దేవదాసు విహ్వాల దృక్కులతో చంద్రముఖి వంక చూసి—'ఇవ్వాళ ఏమిటి నువ్విలా వాగుతున్నావు?' అని అడిగాడు.

చంద్రముఖి మందహాసం చేస్తూ—'దేవదాస్! తనని ప్రేమించని వాళ్ళకు బలవంతంగా తన ప్రేమను వెల్లడించ బోవటం కంటే తెలివితక్కువ పని ఈ ప్రపంచంలో మరొకటి ఉండదు! నేను నాకోసం మాట్లాడటం లేదు; పార్వతి తరఫున వకాల్తా తీసుకున్నాను' అన్నది.

దేవదాసు లేవటానికి ఉపక్రమించి—'ఇక వెళ్తాను' అన్నాడు.

'ఇంకా సేపు కూర్చోండి. మిమ్మల్ని ఎప్పుడూ తెలివిలో ఉండగా నేను చూడలేదు—ఇలా ఎప్పుడూ చేతులు పట్టుకుని మాట్లాడలేదు. ఎంత తృప్తి!' అని కిలకిల నవ్వింది.

'నవ్వుతా వెందుకూ?' అన్నాడు దేవదాసు ఆశ్చర్యంతో.

'ఊరకనే—వెనకటి సంగతులు జ్ఞాపకం వచ్చాయి. పది సంవత్సరాల క్రిందట నేనూ ఒకర్ని ప్రేమించే ఇల్లు వదిలి వచ్చాను. ఎంత ప్రేమించానను కున్నారు! అవసరమైతే ప్రాణాలు కూడా ఇవ్వగలను, అనుకునేదాన్ని. ఆఖరికి చిన్న నగకోసం మేమిద్దరం పోట్లాడుకున్నాము. అది తుదా ఒకరి మొహం ఒకరు చూసుకోలేదు! అతను నన్ను ప్రేమించలేదు; ప్రేమిస్తే ఈ చిన్న నగ తెచ్చిపెట్టే వాడు కాడా అని మనస్సును తృప్తి పరుచు కొన్నాను!' చంద్రముఖి లోలోన నవ్వుకున్నది. తర్వాత కొంచెం గంభీర స్వరంతో చెప్ప నారంభించింది:

'నీ నగలు నాశనం కాను! మామూలు తలనొప్పి నయం చేసినందుకే ఈ ప్రాణం 'అస్, ఉస్' అనకుండా ఇవ్వవచ్చు నని అప్పుడు నాకేమి తెలుసు! అప్పుడు సీతా దమయంతుల వ్యథ నాకు తెలియదు. జగాయీ మాధాయీ కథ నేను నమ్మేదాన్ని కాను. సరే కాని, దేవదాస్! ఈ ప్రపంచంలో అంతా సంభవమే కాదూ?'

దేవదాసు జవాబివ్వలేక పోయాడు. నివ్వెరపోయిన వానివలె ఆమెవంక చూసి—'ఇక పోతాను.' అన్నాడు.

'భయ మేమీ లేదు, ఇం కొంచెంసేపు కూర్చోండి. నేనిక మిమ్మల్ని మభ్యపెట్ట దలచలేదు—ఆ రోజులు గతించాయి. ఇప్పుడు, మీరు నన్నెంత అసహ్యించు కుంటున్నారో, నేను కూడా నన్నంత అసహ్యించు కుంటు న్నాను. సరే, ఆసంగతి పోనివ్వండి. మీరు పెళ్లెందుకు చేసుకో కూడదు?'

ఇంత సేపటికి దేవదాసుకు ఊపిరి సలిపింది. నవ్వుతూ—'చేసు కోవటం మంచిదే, కాని నాకు ఇష్టంలేదు' అన్నాడు.

'ఇష్టంలేక పోయినా చేసుకోండి. పిల్లల మొహం చూస్తే కొంతవరకు శాంతి లభిస్తుంది. పైగా నాకు కూడా దోవ దొరుకుంది. మీ ఇంట్లో నే దాసీగా ఉండి ఈ జీవిత శేషం సుఖంగా వెళ్ళబుచ్చుతాను.'

'ఇంకేం, నిన్నప్పుడు తప్పక పిలుస్తాన!' అన్నాడు దేవదాసు నవ్వుతూ.

చంద్రముఖి అతని నవ్వును చూడనట్టుగా—'మిమ్మల్ని ఇంకోమాట కూడా అడగాలని ఉన్నది.' అన్నది.

'ఏమిటి?'

'ఇవ్వాళ మీరింత సేపు నాతో ఎందుకు మాట్లాడారు?'

'ఏం. తప్పా?'

'ఆ సంగతి చెప్పలేను! కాని కొత్త. తప్పతాగి పడిపోనిది, మీ రెప్పుడూ నా ముఖం చూసేవారు కాదు.'

దేవదాసు ఆ మాటకు జవాబివ్వకుండా—'మా తండ్రిగారు చనిపోయి నప్పటినుంచీ మద్యం మానేశాను,' అన్నాడు విచారంగా.

చంద్రముఖి చాలా సేపు కరుణా దృక్కులతో అతని వంకచూసి—'ఇక త్రాగరా?' అని అడిగింది.

'చెప్పలేను.'

చంద్రముఖి అతనిచేతులు ఇంకా కొంచెం దగ్గరకు లాక్కుని ఆతు ర్యాకుల స్వరంతో—'వీలుంటే వదిలి పెట్టండి. బంగారం లాంటి శరీరాన్ని పాడుచేసుకోకండి' అన్నది.

దేవదాసు చప్పునలేచి నిలబడి—'నేను వెళ్లుతున్నాను. నువ్వు ఎక్కడ ఉన్నదీ నాకు కబురుచెయ్యి. నీ కెప్పుడన్నా, ఏదైనా అవసర మొస్తే నా దగ్గర సిగ్గు పడమాకు' అన్నాడు.

చంద్రముఖి నమస్కారం చేసి పాదధూళి తీసుకుని అన్నది—'నన్ను సుఖ పడమని ఆశీర్వదించండి! ఇంకో యాచన—దేవుడు రాకుండా చేయాలి—ఎప్పుడన్నా దాసీ అవసరముంటే నన్ను పిలిపించండి.'

'అలాగే' నని దేవదాసు వెళ్ళిపోయాడు.

చంద్రముఖి చేతులు జోడించి రోదన స్వరంతో—'ఇంకో మాటు వారు కనపడేటట్లు చేయి భగవంతుడా!' అని దేవుని ప్రార్థించింది.

* * *

దాదాపు రెండేండ్లు గడిచినై. మహేంద్రుని వివాహం చేసి పార్వతి చాలావరకు నిశ్చింతురాలైంది! జలదబాల బుద్ధిమతి. పనిపాటల్లో నిపుణ. పార్వతికి బదులు ఇంటి పనులు ఆమే చూస్తూ ఉండేది. పార్వతి ఇప్పుడు మనస్సును ఇంకో వైపుకు మరల్చింది. వివాహమై చాలాకాల మయినా ఇంకా ఆమె సంతాన ముఖం చూడలేదు. తనకు సంతులేక పోవటంచేత ఎవరి పిల్లలన్నా ఆమె చాలా ఆపేక్షచూపించేది. పేదసాదలమాటలా ఉంచండి; కాస్త నోటికీ చేతికీ ఉన్నవారి సంతాన బాధ్యతకూడా తానే వహించేది. ఇంతేకాక దేవాలయంలో పూజలూ, సాధుసన్యాసులకు సేవలూ, కుంటి—గుడ్డివారికి పరిచర్యలూ చేసి ఆమె కాలం గడుపుతూ ఉండేది. భర్తతో చెప్పి ఇంకో సత్రం కూడా కట్టించింది. అందులో అనాథులూ అసహాయులూ ఇష్టం వచ్చినంత కాలం ఉండవచ్చు. జమీందారుగారే వారి తిండీ—తిప్పలూ చూస్తూ ఉంటారు. పార్వతి చాటుగా ఇంకో పనికూడా చేస్తూ ఉంటుంది; భర్తకు కూడా ఈ సంగతి తెలియ నివ్వదు. బ్రతికి—చెడ్డవారికి గుప్తంగా ధనసహాయం చేయటం. ఈ డబ్బు ఆమె సొంతది. భర్త ప్రతినెలా తన ఖర్చుకు ఇచ్చేదంతా ఇలానే ఖర్చుపెట్టుతూ ఉంటుంది. ఎంత చాటుగా ఖర్చు పెట్టినా కచేరీ గుమాస్తాలకూ, మేనేజరుకూ తెలియకుండా ఉండదు. ఇప్పుడు పూర్వం కన్న ఖర్చు చాలా ఎక్కువైందని వాళ్లల్లో వాళ్లు

తర్కించుకుంటూ ఉంటే దాసీల చెవిని పడేది. ఇక వాళ్ళ దగ్గరనుంచి జలదబాల దగ్గరికి చేరటం ఎంతసేపు పట్టుతుంది?

ఒకనాటి రాత్రి జలదబాల—'ఈ యింటితో మీకేమీ సంబంధం లేదా?' అని భర్తను అడిగింది.

'ఎందుకో చెప్పూ!'

'దాస దాసీలదాకా పోయినా మీరు కనపడటంలేదు. మామగారికి భార్యంటే చాలా తీపి—వారేమీ అనరు! మీరైనా చెప్పటం మంచిది.'

మహేంద్రుడికి ఏమీ అర్థం కాకపోయినా ఉత్సుకతతో 'ఎవరి సంగతీ?' అని అడిగాడు. జలదబాల గంభీరంగా భర్తకు సలహా ఇవ్వ నారంభించింది:

'మీ పిన్నికి పిల్లా జల్లా లేరు. ఆమెకు సంసారంమీద ఎందుకు ఆపేక్ష ఉంటుంది? అందుకనే ఆస్తంతా పాడుచేస్తున్నది. మీరు చూట్టంలేదా?'

'ఏం చేస్తున్నదీ?' అన్నాడు మహేంద్రుడు కనుబొమలు చిట్లించి.

'కాస్త కళ్లు తెరిస్తే మీకే కనపడేది. ఇప్పుడు పూర్వంకంటే కుటుంబ ఖర్చు రెట్టింపవుతూ ఉంది. అతిథి అభ్యాగతులకూ, సదావ్రతాలకూ, దాన ధర్మాలకూ తెంపులేదు. సరే, ఆమె పరం ఆమె చూసుకుంటూ ఉన్నది. ఇక మన ఇహం? మన కిక పిల్లలు పుట్టరా? అప్పుడు వాళ్లేమి తింటారు?'

మహేంద్రుడు పక్కమీద నుంచి లేచి కూర్చున్నాడు.

'నువ్వెవ్వరి సంగతి చెప్పేది? అమ్మ సంగతేనా?' అన్నాడు.

'నారాత ఇలా తగలడింది! అన్నీ విప్పి చెప్పాల్సిన ఖర్మం నాకు పట్టింది.'

'నువ్వు అమ్మమీద ఫిర్యాదు చేస్తున్నావా?'

'నేను ఫిర్యాదూ చేయటంలేదు, చాడీలూ చెప్పటంలేదు. ఆ అవసరం కూడా లేదు నాకు. ఆఖరికి నామీద నెపం వేస్తారని జరుగుతున్న దేమిటో మీచెవిని వేశాను!' అన్నది జలద విసుగ్గా.

మహేంద్రుడు మాట్లాడకుండా కాసేపు ఆలోచించి 'మీకన్న వారింట్లో రోజూ కుండ పొయ్యి ఎక్కదు. నీకు జమీందారుగారి ఇంటి ఖర్చు లేమి తెలుస్తవి?' అన్నాడు.

ఈ మాటకు జలద మండిపోయింది—'మీ అమ్మ కన్నవారు ఎన్ని సత్రాలు

కట్టించారో చెప్పండి ?' అని అడిగింది.

మహేంద్రుడిక తర్కించలేదు. ఉదయాన లేవగానే పార్వతి దగ్గరికి వెళ్లి—'నాకు మంచి పెళ్లే చేశావమ్మా ? నేనిక దీనితో వేగలేను, కలకత్తా వెళ్లుతున్నాను' అన్నాడు.

'ఎందుకు నాయనా ?' అన్నది పార్వతి విస్తుపోయి.

'నిన్న తూలనాడింది. నేను దాన్ని వదిలివేశాను.'

కొన్నాళ్లనుంచి పార్వతి కోడలి ఆచరణ చూస్తూనే వస్తున్నది. కాని తన కేమీ తెలియనట్టుగా, నవ్వుతూ—'కాదు, నాయనా! అమ్మాయి చాలా మంచిది.' అని, తర్వాత జలదబాలను చాటుకు పిలిచి 'మీ రేమన్నా పోట్లాడుకున్నారా అమ్మాయీ !' అని అడిగింది.

ఉదయానే భర్త కలకత్తా పోవటానికి ప్రయాణ సన్నాహాలు చేయటం చూసి జలదబాల భయపడింది; పశ్చాత్తాపం చెందింది. అత్త ప్రశ్న వినగానే ఏడుస్తూ—'తప్పు నాదే అత్తయ్యా! దాసీల మాటలు విని బుద్ధి గడ్డి తిన్నది!' అన్నది.

తర్వాత వివరాలు విని పార్వతి సిగ్గుపడింది. కోడలి కళ్లుతుడుస్తూ—'నువ్వు చెప్పేదే నిజం అమ్మాయీ! నాకు సంసారం పొదుపుగా ఉండాలని తెలియదు. నేను అంత దూరం ఆలోచించలేదు కూడా' అన్నది.

పిమ్మట మహేంద్రుని పిలిచి—'తప్పులేనిది ఎవ్వరినీ శిక్షించకు నాయనా! 'నువ్వు భర్తవు—నీమేలు కంటే భార్యకు కావలసింది ఏముంటుంది? అమ్మాయి నీ లక్ష్మి!' అన్నది.

ఆరోజునుంచీ పార్వతి చెయ్యి వెనకాడింది. సత్రంలోనూ, దేవాలయం లోనూ వెనుకటి మాదిరిగా సేవలు జరగటం లేదు. అనేకమంది వికలాంగులూ, అనాథులూ తిరిగి పోసాగారు. ఈ సంగతి భర్తకు తెలిసి పార్వతిని పిలిచి—'ఏమి అమ్మీ ! అన్నపూర్ణ భండారం ఖాళీ అయిందా ఏమిటి ?' అని అడిగాడు. 'ఊరక ఇచ్చుకుంటూ పోతే కాపురం ఎన్నాళ్ళు గడుస్తుంది—కొన్నాళ్లు కూడబెట్టాలిగా. ఇప్పుడు ఖర్చెంత పెరిగిందో మీకు కనపడటం లేదా ?' అన్నది పార్వతి నవ్వుతూ.

'నే నింకా ఎన్నాళ్లు బ్రతుకుతాను? ఉన్న నాలుగు రోజులూ సత్కార్యాలుచేసి పరలోకం వంక చూడటం మంచిది.'

పార్వతి నవ్వుతూ—'ఇది చాలా స్వార్థపరుల మాటండీ! మీ సంగతే మీరు చూచుకుంటే ఇక పిల్ల లేమైపోతారు? కొంత కాలం ఊరుకోండి; తర్వాత మళ్లీ మొదలు పెట్టవచ్చును. మానవుల కార్యాలకు అంత మెప్పుడూ ఉండదు.' అన్నది.

చౌదరిగారు ఇక విధిలేక ఊరుకున్నారు.

పార్వతికి ఇప్పుడు చేసే పనులేవీ లేవు. అందుకని ఆలోచనలు ఎక్కువైనాయి. ఈ ఆలోచనలలోకూడా రకాలున్నవి. ఆశలున్న వాళ్లు ఒక రకంగా ఆలోచిస్తారు; ఆశలుడిగినవాళ్లు ఇంకోరకంగా ఆలోచిస్తారు. మొదటిరకం ఆలోచనలో జీవం ఉంటుంది. సుఖం ఉంటుంది. దుఃఖం ఉంటుంది. తృప్తి ఉంటుంది. ఎక్కువ సేపు ఆలోచించ లేరు. కాని ఆశాహీనులకు సుఖం లేదు. దుఖం లేదు. ఉత్కంఠత లేదు. కాని తృప్తి ఉంటుంది. కంటినుంచి నీళ్ళూ కారతని. గంభీరత్వమూ ఉంటుంది. కాని సరికొత్త హృదయవేదన ఉండదు. ఆ ఆలోచన మేలిమబ్బువలె ఎటుపడితే అటు కొట్టుకు పోతుంది. గాలి తగలనిచోట నిలబడుతుంది. తగిలినచోటి నుంచి తప్పుకు పోతుంది. తన్మయావస్థలో ఉన్న మనస్సు ఉద్వేగములేని ఆలోచనలో ఒక విధమైన సఫలత పొందుతుంది. ఇప్పుడు పార్వతి స్థితి సరిగ్గా ఇలానే ఉన్నది. పూజ దగ్గర కూర్చున్నప్పుడు స్థిరత్వమూ, ఆశా, ఉద్దేశమూలేని ఆమె మనస్సు చప్పున 'తాల్సోనా పురం'లో ఉండే వెదురుగుమ్మేలూ, మామిడితోపూ, పాఠశాలా, నది ఒడ్డూ మొదలగుచోట్లు తిరిగివచ్చేది. ఒక్కొక్కప్పుడు వాటిలో ఎందులోనైనా చిక్కుబడేది, అప్పుడు పార్వతికూడా వెతికి బయటికి తీసుకు రాగలిగేది కాదు. పూర్వం ఆమె పెదవి మీదకు నవ్వు వచ్చేది; ఇప్పుడు ఒక అశ్రుబిందువు చప్పున పంచపాత్ర నీటిలోపడి కలిసి పోతూఉంది. అయినా కాలం గడిచిపోతూనే ఉన్నది. పనిపాటలు చేస్తూ, మంచిచెడ్డలు చూస్తూ, సేవా శుశ్రూషలు చేసినా గడిచింది. అన్నీ వదిలి ధ్యాన మగ్న యోగినివలె ఉన్నా గడుస్తున్నది. కొంతమంది లక్ష్మి అన్న పూర్ణ

అనేవారు; మరికొందరు అన్యమనస్క, ఉదాసిని అనేవారు; కాని నిన్న ఉదయం నుంచి ఆమెలో ఇంకో మార్పు కనపడుతూ ఉంది. ఆమె కొంచెం తీవ్రంగానూ, కఠోరంగానూ కనపడుతూ ఉంది. నిండుగా, పాటుగా ఉండే గంగలో ఎక్కడనుంచో పోటు వచ్చింది. దీనికి కారణం ఇంటో వాళ్ళ కెవ్వరికీ తెలియదు. నాకుమాత్రం తెలుసును; మనోరమ నిన్న వాళ్ల ఊరినుంచి ఉత్తరం వ్రాసింది:—

'పార్వతీ! మనం చాలాకాలంనుంచీ ఒకరి కొకరం ఉత్తరం వ్రాసుకో లేదు. ఈ తప్పు ఉభయులమీదా ఉంది. ఇది పరిష్కారం చేసుకోవటం మంచిదని నా అభిప్రాయం. ఇద్దరమూ తప్పు ఒప్పుకొని అభిమానాన్ని చంపుకోవటం ఉత్తమం! పెద్దదాన్ని కాబట్టి ముందుగా నేనే క్షమాపణ కోరుతున్నాను. వెంటనే జవాబిస్తావనికూడా ఆశిస్తున్నాను.

'నేను ఇక్కడికి వచ్చి ఒక మాసం కావచ్చింది. మనం కాపురంచేసే స్త్రీలం కాబట్టి దేహారోగ్యాన్ని గురించి అంత శ్రద్ధ తీసుకోము. లక్ష్యపెట్టము. చచ్చిపోతే చెర విరగడ చేసుకున్నదంటాము; బ్రతికుంటే బాగానే ఉన్నా మంటాము. ఇక నాగోడవ అయిలిది. పోతే లోకాభిరామాయణం. విశేషాలు ఎక్కువలేవు. అయినా ఒక సంగతి నీకు వ్రాయాలని నాకు చాలా కుతూ హలంగా ఉన్నది. వ్రాద్దామా వద్దా అని నిన్నటినుంచీ ఆలోచిస్తున్నాను. వ్రాస్తే నీకు దుఃఖం కలుగుతుంది; వ్రాయకపోతే నాప్రాణం మీదకు వస్తుంది —మారీచుని మాదిరి అయింది నా స్థితి! దేవదాసు సంగతి వింటే నీకు తప్పక దుఃఖం కలుగుతుంది; ఇక నీ దుఃఖంచూసి నేను విలపించకుండా ఉండలేను. దేవుడు తప్పించాడు; లేకపోతే, అతని చేతిలో పడినట్లయితే నీవంటి అభి మానిని విషమైనా తినేది- లేక ఏ నుయ్యో, గొయ్యో ఐనా చూచుకునేది! ఇవ్వాళ కాకపోతే ఇంకా రెణ్ణాలకైనా అతని సంగతి నీకు తెలుస్తుంది. లోకాన్ని ఎలా మూయగలం?

'దేవదాసు ఇక్కడికి వచ్చి ఒకవారం రోజులయినది. అతను కలకత్తాలో ఉంటున్నాడనీ, తల్లి కాశీలో ఉంటుందనీ, నీకు తెలుసునుగా! అన్నతో గిల్లి కజ్జా పెట్టుకుని డబ్బు గుంజుకు పోవటానికి మాత్రం మధ్య మధ్య ఇలా

వస్తూఉంటాడని నాకు తెలిసింది. డబ్బు చిక్కిందాకా ఉండి చేతిలో పడగానే వెళ్లిపోతాడట. అతని తండ్రి చనిపోయి రెండున్నర సంవత్సరాలు కూడా కాలేదు. నీకు, వింటే ఆశ్చర్యం కలగవచ్చు. ఈ మధ్యలో అతను సగం ఆస్తికిపైగా ఖర్చు పెట్టాడట. ద్విజదాసు చాలా లెఖ్ఖగాడు. పెద్దలు సంపాదించిన ఆస్తిని చెయ్యి దాటనివ్వలేదు. లేకపోతే లోకులు ఎప్పుడో కాజేసి కూర్చునేవారు. తాగుడులకీ, వేశ్యలకీ తగలేసేవాణ్ణి ఎవరు కాపాడగలరు?—ఒక్క యముడు తప్ప! బహుశా అది కూడా దగ్గరకు వచ్చిందనుకుంటాను. గుడ్డిలో మెల్ల ఏమంటే అతను పెళ్ళిచేసుకోక పోవటమే!

అమ్మో! అతన్ని చూస్తే ఏడుపొస్తుంది! పచ్చటి శరీరం నల్లబడింది. ఆ చక్కదనం పోయింది; సిరి పోయింది—గుర్తు పట్టలేము. జుట్టు ఎన్నడూ దువ్వినట్టు ఉండదు. గాలికి ఎగురుతూ ఉంటుంది. కళ్ళు పీక్కుపోయినవి. ముక్కు కోటేరు మాదిరిగా లేచింది. ఇంత గోతగా ఉన్నాడని ఏమి చెప్పేది. చూస్తే అసహ్యం పుట్టుతుంది, భయంకూడా కలుగుతుంది! పగలంతా నది ఒడ్డునే తుపాకి తీసుకుని పిట్టలు కొడుతూ ఉంటాడు. మరీ ఎండకు ఆగలేకపోతే, ఆ వంతెన దగ్గరఉన్న రేగుచెట్టు క్రింద తల వంచుకుని కూర్చుంటాడు. సాయంకాల ఇంటికి వచ్చి మద్యం త్రాగుతాడు. ఇక రాత్రి నిద్రపోతాడో గస్తీ తిరుగుతాడో దేవుడికే తెలియాలి.

'ఆవాళ సాయంకాలం నేను నీళ్ళు తేవటానికి నదికి పోయాను. దేవదాసు తుపాకి చేత పట్టుకొని నది ఒడ్డునే నడచి వస్తున్నాడు. నన్ను చూసి గుర్తించి నా దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. నేను భయంతో వణికిపోయాను. రేవు దగ్గర ఒక్క పురుగు కూడా లేదు. నా ప్రాణాలు పైనే పోయినవి. దేవుడు కాపాడాడు, తాగుబోతు చేష్టలేవీ చేయలేదు. చాల పెద్దమనిషి తరహాగా 'మనో, బాగా ఉన్నావా, చెల్లీ!' అన్నాడు శాంతంగా.

నే నేమి చేస్తాను? భయంతో—'ఊఁ' అన్నాను తల తిప్పి. అప్పుడతను నిట్టూర్చి—'సుఖంగా ఉండు చెల్లీ! మిమ్మల్ని చూస్తే నాకు చాలా ఆనందంగా ఉంటుంది.' అని నెమ్మదిగా వెళ్ళిపోయాడు. నేను పడుతూ లేస్తూ ఇంటికి పరిగెత్తాను. అమ్మమ్మో! నా అదృష్టం బాగా ఉండింది—

చెయ్యీ గియ్యీ పట్టుకొని లాగ లేదు! సరే, పోనీయి ఆ సంగతి. ఆ భ్రష్టుని సంగతులు వ్రాయాలంటే ఒక గ్రంథం అవుతుంది.

'పారూ, నిన్ను చాల కష్టపెట్టాను కాదూ? నీవు ఇప్పటికైనా అతన్ని మరచిపోలేకపోతే, నీకు దుఃఖం ఎలాగూ తప్పదు. దీనికి మరో ఉపాయమేముంది? ఈ విషయంలో నావల్ల ఏమైనా జరిగి ఉంటే నీ ప్రేమకోరే మనో దీదీని క్షమించు. నీబోటి గుణవంతురాలి కిది ఒక గొప్ప కాదు.'

నిన్ననే ఈ ఉత్తరంవచ్చింది. ఇవ్వాళ మహేంద్రుని పిలిచి — 'రెండు పల్లకీలూ ముప్పయి ఇద్దరు బోయీలూ కావాలి. నేనిప్పుడే తాల్‌సోనాపురం పోతాను.' అన్నది.

మహేంద్రునికి ఆశ్చర్యం వేసింది. 'అలాగే సిద్ధం చేయిస్తాను. కాని రెండు పల్లకీలు ఎందుకమ్మా' అని అడిగాడు.

'నీవుకూడా వెంట రావాలి నాయనా, దోవలో నేను చనిపోతే తలకొరివి పెట్టటానికి కొడుకు ఉండాలిగా.'

మహేంద్రు డిక మాట్లాడలేదు. పల్లకీలు రాగానే ఇద్దరూ బయలుదేరారు.

చౌదరిగారికి ఈ సంగతి తెలియగానే వ్యాకులపడి దాస దాసీలను పిలిచి అడిగాడు. కాని వాళ్లెవరూ కారణం చెప్పలేకపోయారు. అప్పుడాయన బుద్ధినంతా వినియోగించి ఇంకా కొంతమంది సిపాయీలనూ దాసీలనూ పంపించాడు.

'దోవలో కనపడితే పల్లకీలు తిప్పించుకు రమ్మంటారా బాబూ!' అని ఒక సిపాయి అడిగాడు.

వారు కొంచెం ఆలోచించి — 'అక్ఖర్లేదు. మీరు కూడా వెంటనే పోయి ప్రమాదా లేవీ రాకుండా చూడండి.' అన్నాడు.

ఆనాడు పొద్దుకుంకేవరకు పల్లకీలు రెండూ తాల్‌సోనాపురం చేరినవి. కాని దేవదాసు ఊళ్ళోలేడు. మధ్యాహ్నమే కలకత్తా వెళ్ళిపోయాడట.

పార్వతి తల బాదుకుని — 'నా దురదృష్టం' అనుకున్నది. తర్వాత మనోరమను కలుసుకున్నది.

'ఏం పారూ! దేవదాసును చూడటానికి వచ్చావా?' అన్నది మనోరమ.

'కాదు వెంట తీసుకు పోవటానికి వచ్చాను. ఇక్కడ అతనికి 'నా' అనే వాళ్ళెవరూ లేరు.'

మనోరమ దిగ్భ్రమ చెందింది.

'ఏమిటే నువ్వువాగేది? సిగ్గన్నా వేయటంలేదూ?'

'సిగ్గెందుకు? ఎవరి వస్తువు వాళ్ళు తీసుకు వెళ్లటానికి కూడా సిగ్గేనా?'

'ఛీ. ఛీ, అలా అనకు! కాస్త చుట్టరికం అన్నా లేదు. అలాంటి మాటలు నోట రానీయకు—'

పార్వతి మ్లానంగా నవ్వి—'మనోదీదీ! నాకు జ్ఞానం తెలిసినప్పటినుంచీ మనస్సులో నాటుకుపోయిన సంగతి, ఎప్పుడన్నా బయటపడుతూ ఉంటుంది. నువ్వు నా అక్కవు. అందుకనే ఈమాట వినగలిగావు.'

మర్నాటి ఉదయం పార్వతి తల్లిదండ్రులకు నమస్కారంచేసి, మళ్ళీ పల్లకీ ఎక్కింది.

* * *

చంద్రముఖి అశ్వద్ధపురంవచ్చి రెండు సంవత్సరాలైనది. వాగు ఒడ్డున కాస్త మెరకగా ఉన్నచోటుచూసి రెండు నిట్టాళ్ళ పూరికొంప వేసుకున్నది. దాన్ని రెండుగదులుచేసి, ఒకదానిని వంటా సామానువేసుకోటానికీ, రెండవ దానిని పండుకోటానికీ కూర్చోటానికీ ఉపయోగించుకుంటూ ఉన్నది. ఇంటికి కొంచెం దూరంగా చోపరా. దాంట్లో నల్లావు ఉంటున్నది. ఇంటి ముంగిలి ఎప్పుడూ శుభ్రంగా ఉంటుంది. రోజూ పోలికూతురు వచ్చి పాచి ఊడ్చి కల్లాపి చల్లిపోతూ ఉంటుంది. ఇంటిచుట్టూ ఆముదాల కంచె. మెల్లాలో రేగుచెట్టు. ఇంటి వెనక తులసి కోట! నీళ్ళరేవు ఎదురుగానే ఉంది—కూలి వాళ్ళను పెట్టి ఖర్జూరపు చెట్టు మెట్టుగా వేయించింది. ఈరేవు ఈమె తప్ప ఇక నెవ్వరూ వాడరు. వానాకాలంలో మురికి వర్షాలు కురిస్తే నీళ్లు చంద్రముఖి ఇంటిలోకి ఎక్కుతై. గ్రామస్థులు చాలా ఆదుర్దాతో పలుగులూ పారలూ తీసుకువచ్చి నీరు ఇంటికి ఎక్కకుండా కట్టవేసి పోతారు. ఈ గ్రామంలో అగ్రవర్ణాల వారు ఎవరూ లేరు. గొల్లలు, బెస్తలు, గవళ్ళూ, ఊరిబైట రెండు మాదిగ కొంపలు కూడా ఉన్నవి.

చంద్రముఖి ఈ గ్రామం వచ్చినాక దేవదాసుకు ఉత్తరం వ్రాసింది. జవాబుగా ఇంకా కొన్ని రూపాయలు పంపాడు. చంద్రముఖి ఈ డబ్బు ఊళ్లో వాళ్లకు అప్పు పెట్టుతూ ఉంటుంది. ఇబ్బంది వచ్చినప్పుడు వాళ్లు ఈమె దగ్గరకే పరుగెత్తుకొస్తూ ఉంటారు; డబ్బు తీసుకు వెళ్లుతూ ఉంటారు. చంద్రముఖి వడ్డీ తీసుకోదు. దానికి బదులుగా వారు కూరా—నారా పండూ ఫలమూ ఇచ్చి పోతూ ఉంటారు. వడ్డీ అలా ఉంచి, అసలుకోసం కూడా ఈమె అంతగా పీడించదు. ఇవ్వలేనివారు అదీ ఇవ్వరు. చంద్రముఖి నవ్వుతూ—'ఇక నీ కెప్పుడూ ఇవ్వను!' అనేది తీర్పుని వారితో.

'ఈ తఫా బాగా పండేటట్లు దీవించు తల్లీ!' అని వారు బ్రతిమాలే వారు.

చంద్రముఖి దీవించేది. మళ్లీ పంటలు సరిగా పండేవి కావు. శిస్తుకు జమీందారు వత్తిడి పెడితే మళ్ళీ ఈమె దగ్గరకు వచ్చి ఏడుస్తూ నిలబడే వారు. చంద్రముఖి లోలోన నవ్వుకుని—'వారుండగా నా కేమి తరుగు' అని అనుకునేది.

కాని ఆతను ఏడి? దాదాపు ఆరు మాసాలైంది, అతని దగ్గర నుంచి ఉత్తరమే లేదు. రిజిష్టరు ఉత్తరం రాస్తే తిరిగి వచ్చింది. చంద్రముఖి ఒక గొల్ల కుటుంబాన్ని తన యింటి దగ్గర అట్టి పెట్టుకున్నది. భైరవుని కొడుకు పెళ్ళికి పది రూపాయలన్నర ఓలి ఇచ్చింది; నాగలి ఒకటి కొని పెట్టింది. భైరవుడే ఈ కుటుంబానికి పెద్ద. ఈ కుటుంబం ఈమెను ఆశ్రయించుకు బతికేదే; ఈమె చెప్పినట్లు నడుచుకునేదే.

ఒకనాటి ఉదయం చంద్రముఖి భైరవుని పిలిచి—'ఇక్కడికి తాల్‌సోనాపురం ఎంత దూర మంటుందో ఎరుగుదువా?' అని అడిగింది.

భైరవుడు కాస్త ఆలోచించి—'ఎంతమ్మా! రెండు పరుగులేస్తే కచ్చేరీ వచ్చి కూర్చుంటుంది' అన్నాడు.

'అక్కడ జమీందారు ఉంటాడు కదూ?'

'అఁ. ఉన్నారు. ఈ గ్రామం కూడా వారిదే. మూడు సంవత్సరాలైంది, పెద్దాయన చనిపోయి. వారి శ్రాద్ధానికి కొన్ని రోజుల పాటు తిన్నాము. వారికి ఇద్దరు కొడుకు లున్నారు. వారికేమమ్మా మహారాజులు!'

'నన్నక్కడికి తీసుకుపోగలవా, భైరవ్ ?'

'ఎందుకు తీసుకు వెళ్ళలేను తల్లీ! మీ ఇష్టం వచ్చినరోజున సెలవు చేయండి'

'ఐతే ఇవ్వాళే పోదాము, భైరవ్ !' అన్నది చంద్రముఖి ఉత్సాహంతో.

భైరవుడు విస్మితుడై—'ఇవ్వాళే నా !' అని చంద్రముఖి ముఖం వంక పరీక్షగా చూసి—'అయితే త్వరగా వంట చేసుకో తల్లీ! నేను పద్ది కట్టుకు వస్తాను' అన్నాడు.

'ఇప్పుడు కాదులే, భైరవ్ ! నువ్వు చద్ది కట్టుకురా' అన్నది చంద్రముఖి.

భైరవుడు ఇంటికిపోయి చద్దికట్టించుకుని, కర్రచేత పట్టుకుని, ఒక్క క్షణంలో తిరిగి వచ్చి—'ఇక సెలవు చేయండి. కాని, మీరుకూడా కాస్త ఎంగిలి పడకూడదా అమ్మగారూ?' అన్నాడు.

'వద్దు భైరవ్ ! నేనింకా పూజచేసుకో లేదు. వీలుంటే అక్కడికి పోయి నాక చూసు కుంటాను.'

భైరవుడు ముందు దోవచూపిస్తూ నడిచాడు. చంద్రముఖి వెనకే పిప్పి గడ్డల్లో మహా ప్రయాసపడుతూ నడుస్తున్నది. నడక అలవాటు లేకపోవటం. చేత ఆమె పాదాలు బొబ్బలెక్కినై. ముఖం కందిపోయింది ఎండకు. ఇంకా భోం చేయలేదు. అయినా చంద్రముఖి ఒక్కొక్క చేను దాటి పోతూనే ఉన్నది. చేలల్లో పని చేసుకొంటున్న రైతులు ఆమెముఖం వంక ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయారు.

చంద్రముఖి ఎర్రంచుల చీర కట్టుకున్నది. చేతిని రెండు గాజులున్నవి. తలమీద ముసుగు. ఒంటి చుట్టూ దుప్పటి. ఝాము పొద్దు వుండగా ఊళ్ళోకి చేరారు.

'నీ రెండు పరుగులూ ఇప్పటికి పూర్తి అయినాయా!' అన్నది చంద్రముఖి నవ్వుతూ. భైరవుడు పరిహాసం గ్రహించలేక—'వచ్చేశాంగా తల్లీ! మీద్ది సుఖపడ్డ శరీరం మళ్ళీ ఇవ్వాళే తిరిగి రాగలరా?' అన్నాడు.

'ఇవ్వాళేమిటి, రేపుకూడా బహుశా నడిచి రాలేను.' అని చంద్రముఖి మనస్సులో అనుకుని—'ఇక్కడ బండి దొరకదా?' అని అడిగింది.

'ఎందుకు దొరకదు తల్లీ, ఎడ్లబండిని పిలుస్తాను.'

బండి కుదర్చమని చెప్పి చంద్రముఖి జమీందారు గారి మేడలో ప్రవేశించింది. భైరవుడు బండి మాట్లాడటానికి వెళ్ళి పోయాడు.

మేడ రెండో అంతస్తులో పెద్దావిడ—ఇప్పటి జమీందారుగారి భార్య—కూర్చుని ఉన్నది. ఒక దాసీది చంద్రముఖిని వెంట పెట్టుకుని అక్కడికి తీసుకు వెళ్లింది. ఇద్దరూ ఒకరి నొకరు బాగా చూచుకున్నారు. చంద్రముఖి నమస్కరించి.

జమీందారుగారి భార్య ఒంటిమీద నగలు పట్టుకుండా ఉన్నవి. కళ్లల్లో నుంచి అహంకారం పైకి తన్నుతూ ఉన్నది. పెదవులూ పళ్లూ, తాంబూలమూ కానూ వేసుకోవటం మూలాన నలుపుకు తిరిగినవి. ఒక బుగ్గ ఎత్తుగా ఉన్నది. బహుశా తాంబూలపు తమ్మ లోపల ఉండవచ్చు. జుట్టు ఎగదువ్వి నడినెత్తిన చుట్ట చుట్టింది. బూబుల మాదిరిగా రెండు చెవులకూ సందు లేకుండ పోగులున్నవి. ఒక ముక్కున చంద్రవంక; రెండో ముక్కున పెద్ద బెజం. బహుశా అత్తగారి అమలులో ముక్కెర పెట్టుకుని ఉంటుంది. దొండు శరీరం; నల్లగా నిగ నిగలాడుతూ ఉంది. పెద్ద కళ్లు. గుండ్రని ముఖం, నల్లని చీరె కట్టి, సిల్కు జాకెట్టు తొడుక్కున్నది. ఈమెను చూసేవరకు చంద్రముఖికి అసహ్యం కలిగింది.

చంద్రముఖి కొంచెం వయస్సు మిగిలిందైనా చాలా చక్కనిది. బహుశా వీరిద్దరి ప్రాయం ఒకటే కావచ్చును. కాని పెద్దావిడ దీనికి ఒప్పుకోదు! ఈ గ్రామంలో పార్వతి తప్ప ఇంత చక్కనిదాన్ని ఆమె ఎప్పుడూ చూడలేదు. ఆమె ఆశ్చర్యంతో 'ఎవరు మీరు ?' అని అడిగింది.

చం—'తమ ప్రజనేనండీ. కొంచెం శిస్తు బాకీ ఉండి చెల్లించడానికి వచ్చాను.'

పెద్దావిడ లోలోపల సంతోషించి—'అయితే ఇక్కడికి ఎందుకు? కచ్చేరీకి పోరాదా !' అన్నది.

చంద్రముఖి మందహాసం చేసి—'నేను బీదదాన్ని తల్లీ! పన్నంతా చెల్లించ లేను. మహా దయగలవారని విని తమ దగ్గరికి వచ్చాను. అనుగ్రహించి కొంత మాఫీ చేయిస్తే, చెల్లించిపోతాను.' అన్నది.

ఈ మాట పెద్దావిడ తన జీవితంలో యిదే మొదటిసారి వినటం ; ఆమెకు దయ ఉన్నదట ! శిస్తు మాఫీ చేయించవలదట ! ఇంకేం ఆమెకు చంద్రముఖి మీద ఎన్నడూలేని దయ కలిగింది.

'అదే, అమ్మాయీ ! రోజూ నన్ను ఎందరో వచ్చి వేధిస్తూ ఉంటారు. ఎంతో డబ్బు వదిలిపెడుతూ ఉంటాను ! లేదనులేను. అందుకనే మావారు నన్నెప్పుడూ కోప్పడుతూ ఉంటారు ! సరే కాని, నీ బాకీ ఎంత ?'

'ఎక్కువ లేదు తల్లీ. రెండు రూపాయలే. కాని మాకు అవే గగనం. ఇవ్వాళ పగలల్లా పడుతూ లేస్తూ ఇంతదూరం నడచి వచ్చాను.'

'అయ్యో. మీబోటి దీనులమీద దయ చూపించవలసిందే. బిందూ, ఈమెను తీసుకు వెళ్ళి మేనేజరు గారితో నేను చెప్పానని చెప్పి రెండు రూపాయలూ తీసివేయించు. ఆc. నీ ఇల్లు ఎక్కడ అమ్మాయి ?'

'అశ్వద్ధపురం అనే గ్రామం. మీ ఇలాకాలోదే. సరే కాని, అమ్మ గారూ ! ఇప్పుడు జమీందారులు యిద్దరు కాదండీ ?'

'ఇద్ద రేంటి, పాడు! ఇంకా రెండు రోజులుంటే అంతా మాదే అవుతుంది.

'ఎలా తల్లీ ! చినబాబుకు చాలా అప్పున్నదా ?' అన్నది చంద్రముఖి ఉద్విగ్నతతో.

పెద్దావిడ మందహాసం చేసి 'ఆ సంతా మాకు తాకట్టు పెట్టాడు. మామరిది ఇక దివాళే. తప్ప తాగుతూ ముండను పెట్టుకొని కలకత్తాలో ఉంటున్నాడు. ఎంత డబ్బు తగలేశాడో లెఖ్ఖ ఉన్నదా ?' అన్నది.

చంద్రముఖి ముఖం వాడిపోయింది. కాసేపు ఊరుకుని—'చిన్నబాబుగారు ఎప్పుడూ ఇంటికి రారా అమ్మగారూ ?' అని అడిగింది.

'ఎందుకురాడు ? డబ్బు అవసరమైనప్పుడు వస్తాడు. తాకట్టుపెట్టి తీసుకు పోతాడు. రెండు మాసాల కిందట ఒకమాటు వచ్చి పన్నెండు వేల రూపాయలు తీసుకు వెళ్ళాడు. బతికే లక్షణాలుకూడా లేవు. ఒంటి నిండా చెడు రోగాలు, ఛీ, ఛీ—'

చంద్రముఖి కంపించింది 'వారు కలకత్తాలో ఎక్కడ ఉంటారు ?' అని మలిన ముఖంతో అడిగింది.

పెద్దావిడ నొసలు బాదుకుని—'పాడు రాత! అది ఎవ్వరికి తెలుస్తుంది? ఏ హోటల్లోనో తిని, ఎవతె కొంపలోనో పడి ఉంటాడు—అది అతనికి తెలియాలి; అతని సారాబుడ్డికి తెలియాలి!' అన్నది నవ్వుతో

'ఇక నేను వెళ్తాను' అన్నది చంద్రముఖి చప్పున లేచి నిలబడి.

పెద్దావిడ ఆశ్చర్యంతో—'వెళ్తావా?' అని బిందును కేక వేసింది.

'అక్కర్లేదు తల్లీ! నే నొక్కదాన్ని కచ్చేరీకి పోగలను' అని నెమ్మదిగా బయలుదేరింది. బయటకు వచ్చేవరకు ఆమెకోసం భైరవుడు కనిపెట్టుకుని ఉన్నాడు. ఎద్దుబండి సిద్ధంగా ఉన్నది. ఆ రాత్రే చంద్రముఖి ఇంటికి తిరిగి వచ్చింది.

ఉదయాన మళ్ళీ భైరవుని పిలిచి—'నేను కలకత్తా పోవాలి' భైరవ్! నువ్వు ఎలానూ రాలేవు. నీ కొడుకును తీసుకుపోతాను. ఏమంటావు?' అని అడిగింది.

'మీ ఇష్టం తల్లీ. కాని కలకత్తా ఎందుకు, ఏమన్నా అవసరమైన పని ఉందా?'

'అవును భైరవ్! అవసరమైన పనే ఉంది.', 'మళ్ళీ ఎప్పుడొస్తారు అమ్మగారూ?'

ఆ సంగతి చెప్పలేను భైరవ్! వస్తే వెంటనే రావచ్చు. లేకపోతే కొంత ఆలస్యం కావచ్చు. ఒక వేళ అసలు రావటమే పడకపోతే నా ఆస్తంతా నువ్వు తీసుకో

భైరవుడు మొదట నిశ్చేష్టు డయ్యాడు. తర్వాత అతని కళ్ళల్లో నీరు తిరిగింది. 'అవేమి మాటలు తల్లీ; మీరు లేకపోతే ఈ గ్రామంలో ఒక్కరు కూడా బ్రతకరు!' అన్నాడు.

చంద్రముఖి కళ్ళల్లో కూడా నీరు తిరిగింది—'అదేమిటి భైరవ్! నేను ఇక్కడికివచ్చి రెండు సంవత్సరాలేగా అయింది; అంతకు పూర్వం మీరు బ్రతకలేదా?'

దీనికి జవాబు మూర్ఖభైరవుడు ఇవ్వలేకపోయాడు. కాని చంద్రముఖి అంతర్యంలో అంతా గ్రహించింది.

భైరవునికొడుకు రాముడు వెంట రావటం స్థిరపడింది. చంద్రముఖి బండిలో

అవసరమైన సామాను పెట్టి బండి ఎక్కి పోతూ ఉండగా, ఈమెను చూడ టానికి వచ్చిన గ్రామస్థులందరూ ఏడవ నారంభించారు. చంద్రముఖి కళ్లలో కూడా నీరు తిరిగింది.

'పోదు కలకత్తా! దేవదాసుకోసం వెళ్ళుతున్నాను, కాని లేకపోతే నన్ను కలకత్తాకు రాణీని చేస్తానన్నా వీరి ప్రేమను నిరసించి వెళ్లేదాన్ని కాను.' అని మనస్సులో అనుకున్నది.

చంద్రముఖి మర్నాడు క్షేత్రమణి యింటికి వచ్చి దిగింది; పూర్వం ఈమె ఉన్న ఇంట్లో ఎవరో కొత్తవాళ్ళు ఉంటున్నారు. చంద్రముఖిని చూడగానే క్షేత్రమణి విస్తుపోయి—'నువ్వా చెల్లీ! ఇన్నాళ్ళనుంచీ ఎక్కడ ఉంటు న్నావు!' అన్నది.

'అలహాబాదులో' అన్నది చంద్రముఖి నిజం దాచి.

క్షేత్రమణి ఆమెను ఎగాదిగా చూసి—'నీ నగలన్నీ ఏమయినై?' అన్నది.

'అన్నీ వున్నవి.' అన్నది చంద్రముఖి నవ్వుతూ.

చంద్రముఖి ఆనాడే దయాళ్ దగ్గరికి పోయి—'నాకింకా ఎంత రావలసి ఉంటుంది, దయాళ్?' అని అడిగింది.

దయాళ్ చిక్కులో పడ్డాడు:—'అదే, ఇంకా అరవయ్యో డెబ్బయ్యో. రావలసి ఉంటవి. నాలుగైదు రోజుల్లో సర్దుతాను అమ్మాయి!' అన్నాడు.

'ఇప్పుడు డబ్బుతో నాకేమీ అవసరంలేదు. నాకు కొన్ని పనులున్నై. చేసిపెట్టు.'

'ఏం పనులు?'

'నువ్వు రెండు రోజులు పని చెడవలసి ఉంటుంది. మా పేటలో ఒక యిల్లు అద్దెకు కుదర్చాలి—తెలిసిందా?'

'తెలిసిందమ్మాయి!' అన్నాడు దయాళ్ నవ్వుతూ.

'మంచి ఇల్లు మాట్లాడాలి, చెక్కని మంచం, పరుపూ, దిళ్ళూ, దీపాలూ, టేబిలూ—తెలిసిందా?'

దయాళ్ తల ఆడించాడు.

'అద్దం దువ్వెనా, రెండు అద్దకం చీరెలూ, ఒక సిల్కు జాకెట్టూ. మంచి

గిల్టునగలు ఎక్కడ దొరుకుతాయో చెప్పగలవా ?'

దయాళ్ చోటు చెప్పాడు.

'అయితే ఒక సెట్టు మంచివిగా చూసి కొనాలి—నేను కూడా వెంట వస్తాను.' అని నవ్వుతూ—'మాకు ఇంకా ఏమేమి కావాలో నీకు తెలుసుగా; ఒక దాసీని కూడా కుదర్చాలి.' అన్నది. 'ఎప్పటిలోగా అమ్మాయీ !'

'ఎంత త్వరలో అయితే అంత మంచిది: రెండు మూడు రోజులు ఆలస్యమైనా ఫరవాలేదు.' అని అతని చేతికి వందరూపాయల కాగితం, ఒకటి యిచ్చి—'వెనక చూడబోకు. వాణ్ణ్యమైన సరుకుకొను.' అన్నది.

మూడోనాడు చంద్రముఖి కొత్త ఇంట్లోకి వెళ్ళింది. ఆ పగలంతా రామునితో తోడ్పాటుతో తన యిచ్చవచ్చినట్లు అలంకరణ ప్రారంభించింది. ముఖం సబ్బుతో కడిగి, పౌడరు అద్దుకుంది. కాళ్ళకు పారాణీ పెట్టుకొని, తాంబూలం వేసుకుంది. తర్వాత నగలు పెట్టుకుని, జుబ్బాతొడిగి, అద్దకం చీర కట్టుకున్నది. ఎన్నాళ్ళనుంచో సంస్కారం ఎరగని జుట్టును మరల దువ్వి, నెత్తిన కొండీ చుట్టుచుట్టింది. అద్దంలో ముఖం చూచుకుని లోలోన నవ్వుకొని—'ఇంకా ఏమేమి రాసిపెట్టి ఉందో ఈపాడు నొస్టని,'అనుకున్నది.

పల్లెటూరి రాముడు ఈ కొత్త అలంకరాలూ, దుస్తులూ చూసి గాభరాపడి 'ఇదేమిటి అక్కయ్యా ?' అని అడిగాడు.

చంద్రముఖి నవ్వుతూ—'ఎవ్వాళ నాథుగ్గ వస్తాడు రామూ !' అన్నది.

రాముడు విస్మయంతో చూస్తూ ఉండిపోయాడు. సాయంత్రం అయినాక క్షేత్రమణి ఊసుపోకకు వచ్చి—'మళ్ళీ ఇదేమిటి చెల్లీ !' అని అడిగింది.

'మళ్ళీ ఇవన్నీ కావలసిందేగా !' అన్నది చంద్రముఖి మందహాసం చేస్తూ.

క్షేత్రమణి కాసేపు అలానే చూసి—'చెల్లికి ఏళ్ళతోపాటు రూపంకూడా పెరుగుతూ ఉంది !' అన్నది.

క్షేత్రమణి వెళ్ళిపోయిన తర్వాత చంద్రముఖి మళ్ళీ వెనకటి మాదిరిగానే కిటికీ దగ్గ కూర్చుని రెప్ప వాల్చకుండా రోడ్డువంక చూడ నారంభించింది. ఆమె పని ఇదే; దీనికోసమే ఆమె వచ్చింది—ఇక్కడ ఉన్నన్నాళ్ళు ఈ పనే చేస్తుంది.

ఎప్పుడన్నా కదాచితుగా కొత్తవాళ్ళు వచ్చి తలుపు తట్టుతూ ఉండేవారు. ఇంట్లో కూర్చున్న రాముడు వల్లించిన పాఠంలా—'ఇక్కడ లేరు' అని అప్పగిస్తూ ఉండేవాడు. వెనుకటి పరిచయాన్ని బట్టి ఎవరన్నా లోపలికివస్తే చంద్రముఖి వారిని కూర్చోబెట్టి నవ్వుతూ మాట్లాడేది. మాటల సందర్భంలో దేవదాసు సంగతి అడిగేది. వారికి తెలిసేది కాదు—వారు ఊరకనే పోవలసి వచ్చేది. రాత్రి చాలా ప్రొద్దుపోయిన తర్వాత చంద్రముఖి స్వయంగా బయలుదేరి ప్రతి గల్లీ, ప్రతి ద్వారమూ వెదుకుతూ తిరిగేది! ఎవరన్నా ఇంట్లో మాట్లాడుకుంటున్నట్టు తెలిస్తే చంద్రముఖి చెవి ఆనించి వినటానికి ప్రయత్నించేది—ఏమేమో మాట్లాడుకుంటూ ఉండేవారు. కాని ఆమెకు కావలసిన మాటలు వినపడేవి కావు. అప్పుడప్పుడు ఎవరన్నా తాగుబోతులు ఆమెను పట్టుకోవటానికి వెంటపడేవారు! చంద్రముఖి ప్రాణాలు తప్పించుకు పరుగెత్తుతూ ఉండేది. ఇక మధ్యాహ్నం ఆమె ఎరిగిన ఇళ్ళకెల్లా వెళ్ళుతుండేది. మాటల సందర్భంలో 'మీలో ఎవరన్నా దేవదాసును ఎరుగుదురా?' అని అడిగేది.

'ఏ దేవదాసు?' అని వారడిగేవారు.

చంద్రముఖి కుతూహలంతో దేవదాసును వర్ణించేది:

'పచ్చని ఒళ్ళు, గొగ్గుల గొగ్గుల క్రాపు. తల మీద కుడివైపున తెగిన మచ్చ. చాలా ధనవంతుడు, డబ్బు దుబారాగా ఖర్చుచేస్తూ ఉంటారు-ఎరుగుదురా ఎవరన్నా?' అని అడిగేది.

ఎవ్వరూ జాడ చెప్పేవారు కాదు. చంద్రముఖి హతాశురాలై, చిన్నపోయిన ముఖంతో ఇంటికి వచ్చేది. చాలా పొద్దుపోయేవరకు మేల్కొని రోడ్డువంకనే చూస్తూ ఉండేది. నిద్రవస్తే విసుక్కునేది. 'ఇది నీకు నిద్రపోయే సమయమా?' అని మనస్సును హెచ్చరించుకునేది.

ఇలా ఒక మాసం గడిచింది. రాముడు విసుగెత్తిపోయాడు. దేవదాసు ఇక్కడ లేడేమోనని కూడా చంద్రముఖికి సందేహం కలగనారంభించింది. అయినా ఆశను మాత్రం వదలుకో లేదు. దేవతల్ని ప్రార్థిస్తూ దినాలు గడుపుతూ ఉన్నది.

నెలా పదిహేను రోజులు గడిచినవి. ఆవాళ రాత్రి చంద్రముఖి నోము ఫలించింది; రాత్రి పదకొండు గంటలకు, ఏదకి వేసారి హతాశురాలై ఇంటికి తిరిగి వస్తూ ఉండగా రోడ్డు పక్కను ఎవరో పండుకొని తనలో తాను వాక్కుంటూ ఉండటం చూసింది. చంద్రముఖి గుండె దడదడ కొట్టుకున్నది. ఈ గొంతుక ఈమె ఎరిగిందే! కోటిమందిలో ఉన్నా గుర్తించగలదు. ఆ వ్యక్తి పడి ఉన్న చోట కొంచెం చీకటిగా ఉన్నది. పైగా అతను తప్ప తాగి బోర్ల పండుకుని ఉన్నాడు. చంద్రముఖి దగ్గరికిపోయి అతని వంటిమీద చెయ్యివేసి—'మీ రెవరండీ. ఇలా పండుకున్నా రెందుకు?' అని అడిగింది.

'విను సఖీ! నాదు మనవి, శ్యామసుందరు తోడి తేవే—' అన్నాడతను కూనిరాగంతో. చంద్రముఖి సందేహం తీరింది—'దేవదాస్!' అని పిలిచింది.

దేవదాసు ఆ విధంగానే—"ఊఁ, తోడితేవే!' అన్నాడు.

'ఇక్కడ పడుకున్నా వెందుకు? ఇంటికి వస్తావా?'

'రాను. నాకిక్కడే బాగుంది.'

'ఇంకాస్త సారా తాగుతావా?'

'తాగుతాను.' అని అతను చంద్రముఖి మెడ వాటు వేసుకు—'ఎవరు బాబూ నువ్వు, నా కింత ప్రాణ మిత్రుడివి' అన్నాడు.

చంద్రముఖి కళ్ళవెంట నీరు కార నారంభించింది. దేవదాసు ఆమె మెడ పట్టుకుని తూలుతూ ఎలాగో చాలా ప్రయాసమీద లేచి నిలబడి చంద్రముఖి ముఖం వంక చూచి—'వహ్వా! భలే నాణ్యమైన సరుకోయ్ దేవదాస్!' అన్నాడు. చంద్రముఖికి ఏడుపులో కూడా నవ్వు వచ్చింది.

'ఆఁ, బలే నాణ్యమైన సరుకు! సరే, నా భుజం మీద చెయ్యివేసి ఇంకాస్త దూరం నడువు. బండి కావాలి కాదూ?' అన్నది.

'ఎందుకు కావద్దూ!' అని దేవదాసు దోవను నడుస్తూ—'నువ్వు నన్ను ఎరుగుదువా, సుందరీ?' అని పట్టుకుపోయిన గొంతుతో అడిగాడు.

'ఎరుగుదును' అన్నది చంద్రముఖి.

'అంతా నన్ను మరిచిపోయిరీ, ఇక నువ్వే మిగిలావ్' అన్నాడు దేవదాసు పాడుతూ.

తర్వాత చంద్రముఖి ఆధారంతో బండి ఎక్కి ఇంటికి చేరాడు. వాకిటి దగ్గర నిలబడి జేబులో చెయ్యి పెట్టి—'సుందరీ! దోవలో ఉన్న వాణ్ణి పట్టుకొచ్చావు కాని జేబులో దమ్మిడీకూడా లేదు?' అన్నాడు. చంద్రముఖి మాట్లాడకుండా లోపలికి లాక్కొచ్చి మంచంమీద పడుకోబెట్టి నిద్రపొమ్మని చెప్పింది.

దేవదాసు పట్టుకుపోయిన గొంతుతో—'ఇంకా వేరే ఆశ లేమైనా ఉన్నాయా ఏమిటి? నేను ముందుగానే చెప్పాను—జేబు ఖాళీ. లాభం లేదని—తెలిసిందా, సుందరీ?' అన్నాడు.

సుందరి తెలుసుకుని—'రేపు ఇద్దువుగానిలే!' అన్నది.

'అంత నమ్మకం మంచిది కాదు. ఏమి కావాలో స్పష్టంగా చెప్పు.'

'రేపు విందువు గాని' అని చంద్రముఖి పక్క గదిలోకి వెళ్ళిపోయింది.

దేవదాసుకు నిద్ర తెలిసేవరకు చాలా ప్రొద్దు ఎక్కింది. గదిలో ఎవ్వరూ లేరు—చంద్రముఖి స్నానం చేసి వంట చేస్తూ ఉన్నది. దేవదాసు ఒక మాటు గది అంతా పరికించాడు. ఒక్క వస్తువు కూడా అతను గుర్తించలేక పోయాడు. క్రిందటి రాత్రి సంగతులు కూడా అతని కేమీ జ్ఞాపకం లేవు; ఎవరో మనసారా చేసిన పరిచర్య మాత్రం జ్ఞాపకం ఉన్నది—ఎవరో అతన్ని మహాప్రేమతో తీసుకువచ్చి నిద్రపుచ్చటం లీలగా తోస్తున్నది.

ఇంతలో చంద్రముఖి గదిలోకి వచ్చింది. అలంకరణలో రాత్రికీ ఇప్పటికీ ఆమెలో చాలామార్పు కనిపించింది. నగ లేమీ తీసివేయలేదు; కాని తల దువ్వలేదు. అద్దకంచీర కట్టలేదు. తాంబూలం వేయలేదు. మామూలు సాదా చీర కట్టుకున్నది. దేవదాసు ఆమెముఖంవంక చూసి నవ్వి—'నిన్న నువ్వు నన్ను ఎక్కడనుంచి దోచుకొచ్చావు?' అని అడిగాడు.

'దోచుకు రాలేదు. దోవలో పడివుంటే ఎత్తుకువచ్చాను.'

దేవదాసు గంభీరంగా—'సరే ఎలాగైతేనేం తెచ్చావు. కాని, ఏమిటి మళ్ళీ ఈవేషం? ఒంటిమీద నగలు పట్టటం లేదు. ఎవరిచ్చారు?' అన్నాడు.

చంద్రముఖి దేవదాసువంక తీక్షణంగాచూసి—'మళ్ళీ?' అన్నది.

దేవదాసు నవ్వుతూ—'ఊహుం—అదికాదు. కాస్త సరసం ఆడితే తప్పా!

ఎప్పు డొచ్చావు?' అన్నాడు.

'నెలా పదిహేను రోజులైంది.'

దేవదాసు మనసులో లెఖ్ఖ వేసుకొని—'మా ఇంటిదగ్గరనుంచి ఇటే వచ్చావా?' అన్నాడు. చంద్రముఖికి ఆశ్చర్యం కలిగింది.

'మీ ఇంటికి వెళ్ళానని ఎలా తెలుసుకున్నారు?'

'నువ్వెళ్ళిన రెండురోజులకు నేను ఇంటికి వెళ్ళాను. నిన్ను మావదినెదగ్గరికి తీసుకువెళ్ళిన దాసీ, మొన్న అశ్వద్ధపురంనుంచి చక్కని స్త్రీఒకతె వచ్చిందని చెప్పింది. ఇక తెలుసుకోడం ఏమి కష్టం? సరేకాని ఇన్నినగలు ఎందుకు చేయించావు?'

'చేయించలేదు. ఇవన్నీ గిల్టువి, కలకత్తా వచ్చి కొన్నాను. చూడండి, మళ్ళీ మీ మూలాన ఎంత ఖర్చుపెట్టవలసిన వచ్చిందో? ఇంతకూ మీరు నన్ను గుర్తించనే లేకపోయారు!'

దేవదాసు పకపకనవ్వి—'ఉహుం. బొత్తిగా! కాని నీ పరిచర్యమాత్రం గుర్తించాను. చంద్రముఖి తప్ప నాకింత పరిచర్య ఎవరు చేస్తారని చాలా సార్లు అనుకున్నాను.'

చంద్రముఖి ఆనందంపట్టలేక ఏడవా లనుకున్నది. కొంచెంసేపు మౌనంగా ఉండి—'మీరు నన్ను పూర్వంమాదిరిగా అసహ్యంచుకోవటంలేదు కదూ!' అని అన్నది.

'లేదు, పైగా ప్రేమిస్తున్నాను,'

మధ్యాహ్నం దేవదాసు స్నానంచేసేటప్పుడు, అతని పొట్టమీద ప్లాసలు గుడ్డకట్టి ఉండటంచూసి, చంద్రముఖి భయపడుతూ—'అదేమిటి! ప్లాసలు కట్టారెందుకు?' అని అడిగింది.

'నీకింత ఆదుర్దా ఎందుకు? కడుపులో కొంచెం నొప్పిగా ఉన్నది.'

చంద్ర తల బాదుకుని—'కొంపముంచి లివరు జబ్బు కాదుగదా?' అన్నది.

'అలాగే కనపడుతున్నది, చంద్రముఖీ!' అన్నాడు దేవదాసు.

ఆరోజునే డాక్టరువచ్చి చాలాసేపు పరీక్షించి ఈ సందేహమే వెలి బుచ్చాడు. మందిచ్చి చాలా జాగ్రత్తగా ఉండకపోతే ప్రమాదం చేయవచ్చుని

హెచ్చరించాడు. దీని అర్థం ఇద్దరూ గ్రహించారు; దేవదాసు బసకు కబురు చేసి ధర్మదాసుకు పిలిపించాడు; చికిత్సకోసం డబ్బుకూడా తెప్పించాడు. రెండురోజు లిలా గడిచినవి. మూడోనాడు దేవదాసుకు జ్వరం తగిలింది. చంద్రముఖిని పిలిచి—'మంచి అదనులో వచ్చావు. లేకపోతే నిన్ను చూసే వాణ్ణి కాను' అన్నాడు.

చంద్రముఖి కళ్లు తుడుచుకుని ప్రాణాలు ఒడ్డి సేవచేయ నారంభించింది. 'వారి అవసరానికి అక్కరకువస్తానని అనుకోలేను—దేవదాసుకు ఆరోగ్యం కలిగించు!' అని భగవంతుని ఉద్దేశించి ప్రార్థించింది. దేవదాసు ఒక మాసం కంటే ఎక్కువే మంచంలో ఉన్నాడు. తర్వాత నెమ్మదిగా అతని జబ్బు తిరుగుముఖం పెట్టింది—ప్రమాదస్థితికి రాలేదు.

ఒకనాడు దేవదాసు చంద్రముఖితో—'చంద్రముఖీ! నీ పేరు చాలా పెద్దది. ఎప్పుడూ పిలవాలంటే చాలా ఇబ్బందిగా ఉన్నది—కొంచెం చిన్నది చేయా లనుకుంటున్నాను' అన్నాడు.

'మంచిదేగా' అన్నది చంద్రముఖి.

'అయితే. ఇవ్వాళనుంచి నేను నిన్ను 'అమ్మా' అని పిలుస్తాను.

చంద్రముఖి నవ్వి—'అలాగే పిలవండి. కాని పిలుపుకి అర్థముండాలిగా!' అన్నది.

'అన్ని మాటలకూ అర్థముంటుందా? అది నా అభిలాష.'

'అంత అభిలాషగా ఉంటే పిలవండి. కాని ఆ అభిలాష ఎందుకో చెప్పుతారా?'

'ఉహుఁ, అది నువ్వెప్పుడూ అడగకూడదు.'

'అలాగే, అడగనులెండి.' అని చంద్రముఖి ముఖం చాటుచేసుకున్నది.

దేవదాసు చాలాసేపు మాట్లాడకుండా ఉండి అకస్మాత్తుగా—'సరే! అమ్మా, నువ్వు నాకెవ్వరవని ఇంత ప్రాణప్రదంగా సేవ చేస్తున్నావు?' అని గంభీరంగా అడిగాడు.

చంద్రముఖి కొత్త పెళ్లికూతురూ కాదు. వాక్పటుత్వం లేని బాలికా కాదు దేవదాసు ముఖం వంక రెప్పవాల్చకుండా, శాంతంగా చూస్తూ—'మీరే నా

సర్వస్వం—ఇంతవరకు మీరు తెలుసుకోనేలేదా' అన్నది, గద్గదస్వరంతో.

దేవదాసు గోడవంక దృష్టి మరల్చి మెల్లగా—'తెలుసుకున్నాను. కాని నాకిది ఏమీ ఆనందం కలిగించటంలేదు. పార్వతిని నే నెంత ప్రేమించేవాడినీ; ఆమె నన్నెంత ప్రేమించేది. అయినా ఎన్ని చిక్కులు? అనేక కష్టాలు అనుభవించిన మీదట ఇక ఈ ఉచ్చుల్లో కాలు పెట్టకూడదని స్థిరపరచుకొన్నాను; నా ఇష్టంతో పెట్టనూలేదు. కాని నువ్విలా ఎందుకు చేశావు? బలవంతాన నన్నెందుకు బంధించావు?' అని కాసేపు ఊరుకుని — 'అమ్మో? నన్ను ప్రేమిస్తే నువ్వుకూడా పార్వతిమాదిరిగా కష్టాల పాలవుతావు!' అన్నాడు.

చంద్రముఖి చెరుగుతో ముఖం కప్పుకుని మంచానికి ఒక పక్కన కూచున్నది. దేవదాసు మరల మెల్లగా చెప్పనారంభించాడు.

'మీ ఇద్దరిలో ఎంత భేదమున్నది; ఎంత సామ్యమున్నది. ఒకరిలో ఎంత ఉద్ధ్రతం, ఎంత అభిమానం; రెండవ వారిలో ఎంత శాంతం, ఎంత నిగ్రహం. ఆమెలో ఎంత మాత్రం సహనంలేదు; ఇక నీలో ఎంత సహన శక్తి; ఆమెకు ఎంత కీర్తి; నీకెంత కళంకం. ఆమెను అందరూ ప్రేమించేవారే; ఇక నిన్ను అందరూ అసహ్యించుకునేవారే! అయినా నేను నిన్ను ప్రేమిస్తున్నాను; ఎందుకు ప్రేమించను?' అని దేవదాసు నిట్టూర్చి మళ్ళీ చెప్ప నారంభించాడు: 'పాప పుణ్యాలను విచారించే భగవంతుడు నీకేమి శిక్ష విధిస్తాడో నాకు తెలియదు. కాని చనిపోయిన తర్వాత మళ్ళీ మన మిద్దరం కలుసుకోవటం సంభవిస్తే, నిన్ను విడిచిపెట్టి ఉండను.'

చంద్రముఖి లోలోపల హృదయం కరిగిపోయేటట్టు ఏడ్చింది—'ఏ జన్మలోనైనా, ఎప్పటికైనా ఈ పాపిష్ఠురాలి పాపం పరిహారమైతే నాకీ వరమే అనుగ్రహించు, భగవంతుడా!' అని దేవుని ఉద్దేశించి మనస్సులో ప్రార్థించింది.

* * *

రెండు మాసాలు గడిచినవి. దేవదాసుకు ఆరోగ్యం కలిగింది. కాని ఇంకా ఒంట్లో పురి రాలేదు. గాలి మార్పు అవసరమని డాక్టరు చెప్పాడు. రేపు ధర్మదాసును వెంటబెట్టుకొని అలహాబాదు వెళ్ళుతాడు.

'మీకు ఎలానూ ఒక దాసీ కావాలి; నన్ను వెంట రానివ్వడి.' అని చంద్ర ముఖి పట్టు పట్టింది.

దేవదాసు ఒప్పుకోలేదు:—'ఛీ—నే నంత సిగ్గు విడవలేను' అన్నాడు. చంద్రముఖి ఇక మాట్లాడలేదు. ఆమె తెలివి తక్కువది కాదు. ఈ మాట లోని అర్థం సహజంగానే గ్రహించింది. ఆమెకు ఈ ప్రపంచంలో మిగతావి ఎన్ని ఉన్నా గౌరవం మాత్రం లేదు. ఆమె వెంట ఉంటే, దేవదాసు సుఖ పడతాడు కాని సన్మానం పొందలేడు. చంద్రముఖి కాసేపు మౌనంగా ఉండి, కళ్లు తుడుచుకుని—'మళ్లీ మిమ్మల్ని ఎప్పుడు చూడగలను ?' అని అడిగింది.

'చెప్పలేను, కాని నిన్ను మాత్రం నేను బ్రతికుండగా మరచిపోను. నిన్ను చూడాలనే దాహం నా కెప్పుడూ చల్లారదు.'

చంద్రముఖి అతనికి నమస్కరించి ఎడంగాపోయి — 'నాకిదే పదివేలు. ఇంతకంటె ఎక్కువ ఆశించను.' అని మెల్లగా అనుకున్నది.

వెళ్లేటప్పుడు దేవదాసు ఇంకా రెండు వేల రూపాయలు చంద్రముఖి చేతిలో పెట్టి—'దాచుకో, మానవ శరీరాన్ని నమ్మకూడదు. చివరకు నువ్వు ఎటూ కాకుండా పోతావేమో!' అన్నాడు. చంద్రముఖి ఇది కూడా గ్రహించి డబ్బు తీసుకున్నది. తర్వాత కళ్లు తుడుచుకుని—'మీరు నా ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పి పోతారా?' అని అడిగింది.

'ఏమిటి ?' అన్నాడు దేవదాసు చంద్రముఖి వంక చూస్తూ.

'మీ ఒంట్లో చెడు జబ్బులు ప్రవేశించా యని మీ వదినె చెప్పింది; నిజమేనా ?'

ప్రశ్న విని దేవదాసు చాలా వ్యథ పడ్డాడు—'వదినె ఏదైనా చెప్పుతుంది; కాని ఉంటే నీకు తెలియవా ? ఒక్క విషయంలోమాత్రం నువ్వు పార్వతి కంటే మిగులు.'

'బ్రతికాను,' అని చంద్రముఖి ఇంకోమారు కళ్ళు తుడుచుకుని—'అయినా మీరు కొంచెం జాగ్రత్తగా ఉండండి. అసలే మీ వంట్లో బాగా లేదు. ఎప్పుడన్నా పొరపడతారేమో!' అన్నది.

దేవదాసు జవాబుగా నవ్వాడు. మాట్లాడలేదు.

8

'ఇంకో భిక్ష—ఒంట్లో ఏమాత్రం బాగా ఉండక పోయినా నాకు—కబురు చేస్తానని మాట ఇవ్వండి.'

దేవదాసు చంద్రముఖి వంక చూస్తూ, తల తిప్పి—'ఎందుకు చేయను అమ్మీ!' అన్నాడు.

చంద్రముఖి ఇంకోమాటు నమస్కరించి ఏడుస్తూ ఇంట్లోకి వెళ్ళింది.

* * *

కలకత్తా వదిలిన తర్వాత దేవదాసు కొన్నాళ్ళు అలహాబాదులో ఉన్నాడు. అక్కడ వుంటూ వుండగా ఒకనాడు చంద్రముఖికి ఇలా ఉత్తరం వ్రాశాడు:

'అమ్మీ! ఇక ఎప్పుడూ ఎవ్వరినీ ప్రేమించకూడదని నిశ్చయించుకున్నాను. ప్రేమించి ఉత్త చేతులతో తిరిగి రావటం ఎవరికైనా చాలా బాధిస్తుంది. ఆ పైన నాదేనని ప్రేమించబోవటంకంటే గొప్ప వంచన ఈ ప్రపంచంలో మరొకటి లేదు.'

చంద్రముఖి దీనికి ఏమి జవాబు రాసిందో మనకు అనవసరం. కాని చంద్రముఖిని ఇక్కడకు పిలిస్తే బాగుంటుందని దేవదాసు అప్పుడప్పుడు అనుకుంటూ ఉండేవాడు. మళ్లీ పార్వతికి తెలుస్తుందేమో! అని భయపడుతూ ఉండేవాడు.

ఇలా ఒకమాటు చంద్రముఖీ, మరోమాటు పార్వతీ అతని హృదయ రాజ్యంలో నివసిస్తూ ఉండేవారు. ఎప్పుడన్నా వారిద్దరి ముఖాలూ+వారికి ఎంతో స్నేహ మున్నట్టుగా—అతని హృదయ పటం మీద దగ్గర దగ్గరగా అంకిత మయ్యేవి; కలుసుకు పోయేవి. ఒక్కొక్కప్పుడు దేవదాసుకు వారిద్దరూ నిద్రపోతున్నారా, అని అనిపించేది. ఆ సమయంలో అతని హృదయం శూన్యంగా ఉండేది; నీరసంగా ఉండేది. ఏదో ఒక జీవంలేని అసంతృప్తి మిథ్యా ప్రతిధ్వనివలె అతని మనస్సులో తిరుగుతూ ఉండేది.

దేవదాసు అక్కడి నుంచి లాహోరు బయలుదేరాడు; చున్నీలాలు అక్కడనే ఉద్యోగం చేస్తున్నాడు. అతను ఉండేచోటు తెలుసుకుని ఇంటికి వెళ్లాడు. చాలాకాల మైనాక మిత్రులు ఒకరినొకరు చూచుకుని సిగ్గుపడ్డారు; సంతోషపడ్డారు. మళ్లీ దేవదాసు సురాదేవిని ఆరాధించాడు.

దేవదాసుకు చంద్రముఖి మద్యం అంటుకోవద్దని హెచ్చరించిన సంగతి జ్ఞాపకం వచ్చేది. 'ఆమె ఎంత తెలివికలది, ఎంత ధైర్యం కలది!' అని అతను అనుకునేవాడు. పార్వతి ఇప్పుడు నిద్రపోతున్నది; ఆరిపోయే ముందు దీపం మాదిరిగా ఎప్పుడన్నా భగ్గున వెలిగేది.

మధ్య మధ్య దేవదాసుకు జబ్బు చేస్తున్నది; పొట్టలో నొప్పిగా ఉన్నట్టు ఉండేది. ఒకనాడు ధర్మదాసు ఏడుస్తూ—'మీకు మళ్ళీ జబ్బుచేస్తుంది; ఎక్కడికన్నా వెళ్లుదాము పదండి బాబుగారూ!' అన్నాడు.

దేవదాసు అన్యమనస్కంగా—'అలాగే వెళ్దాము' అన్నాడు.

దేవదాసు బసలో ఉండగా మద్యం తాగేవాడుకాడు. ఎప్పుడయినా చున్నీలాలు వస్తే తాగేవాడు; లేకపోతే బయటకు వెళ్ళి పోయేవాడు. తెల్లవారుతూ ఉండగా బసకు వచ్చేవాడు; ఒకో రోజున వచ్చేవాడు కాడు. ఇవ్వాళకు రెండు రోజులనుంచి ఇంటికి రాలేదు. ధర్మదాసు ఈ రెండు రోజులు అన్నం నీరూ ఎరగడు; ఏడుస్తూనే ఉన్నాడు. మూడోనాడు దేవదాసు పుట్టెడు జ్వరంతో వచ్చాడు. అ పడక పడక కొన్నాళ్లపాటు లేవలేదు. ముగ్గురు నలుగురు డాక్టర్లు వచ్చి చికిత్సచేయ నారంభించారు.

'అమ్మగారికి కబురు చేయనా, బాబూ!' అని ధర్మదాసు అడిగాడు.

తల్లి కాశీలో ఉంటున్నది.

'వద్దు ధర్మా! నేను ఈ స్థితిలో తల్లికి ముఖం ఎలా చూపించగలను!'

'రోగాలూ కష్టాలూ అందరికీ వస్తాయి. ఇలాంటి ఆపదలోకూడా తల్లికి తెలుపకుండా ఉండటమా? మీరు బిడియపడకండి బాబుగారూ, కాశీ వెళ్దాము.'

దేవదాసు ముఖం తిప్పుకుని—'ఇప్పుడు కాదులే ధర్మా, నయమయినాక చూసుకుందాం.' అన్నాడు.

ధర్మదాసు ఒకమాటు చంద్రముఖిని జ్ఞాపకం చేద్దామా అనుకొన్నాడు. కాని అతనికి చంద్రముఖి అంటే అసహ్యం. అంచేత ఆ పేరు ఎత్తలేదు.

దేవదాసుకూడా ఈ సంగతి చాలాసార్లు అనుకున్నాడు. కాని బయట పెట్టటానికి ఇష్టం లేదు. అందుకని ఈ ఊసు ఎవ్వరూ తేలేదు. తర్వా

దేవదాసుకు నెమ్మదిగా ఆరోగ్యం కలిగింది. ఒకనాడు ధర్మదాసుతో 'ధర్మా ఎక్కడికన్నా మళ్లీ వెళ్దామా?' అన్నాడు.

'ఎక్కడకు వెళ్ళినా లాభంలేదు బాబూ; ఇంటికన్నా, తల్లిగారి దగ్గర కన్నా వెళ్దాము పదండి.' అన్నాడు ధర్మదాసు.

సామానంతా కట్టి చున్నీలాలు దగ్గర సెలవు తీసుకుని దేవదాసు మళ్ళీ అలహాబాదు వచ్చాడు. ఒంట్లో బాగా ఆరోగ్యంగానే ఉన్నది. ఇక్కడ కొన్నాళ్ళు గడిపినాక—'ధర్మా, ఏదన్నా కొత్తచోటుకు పోకూడదా? బొంబాయి నే నెప్పుడూ చూడలేదు వెళ్దామా?' అన్నాడు ధర్మదాసుతో.

తనకు ఇష్టం లేకపోయినా, దేవదాసు పట్టుదలచూసి, ధర్మదాసు ఒప్పుకున్నాడు. అది జ్యేష్టమాసం బొంబాయిలో ఎండలు అంత విశేషంగాలేవు. దేవదాసు ఇక్కడకు వచ్చినాక బాగుపడ్డాడు. కొన్నాళ్ళు గడిచినాక ధర్మదాసు—'ఇక యింటికి వెళ్ళకూడదా బాబూ?' అని దేవదాసును అడిగాడు.

'ఇప్పుడు వద్దు. నా కిక్కడే బాగుంది. కొన్నాళ్ళపాటు ఉంటాను.' అన్నాడు దేవదాసు.

* * *

**ఒ**కసంవత్సరం గడిచింది. భాద్రపదమాసంలో ఒకనాటి ఉదయాన దేవదాసు ధర్మదాసుభుజంమీద భారంవేసి బొంబాయిలోని ఒక ఆసుపత్రి నుంచి బసకు తిరిగివచ్చాడు.

'ఇప్పుడైనా అమ్మదగ్గరికిపోవటం మంచిదనుకుంటా బాబూ!' అన్నాడు ధర్మదాసు.

దేవదాసు కళ్లల్లో నీరు తిరిగింది. కొన్నాళ్ళనుంచి అతనికి ఎప్పుడూ తల్లి జ్ఞాపకం వస్తున్నది. ఆస్పత్రిలో పండుకుని అత నెప్పుడూ—'ఈ ప్రపంచంలో నాకు అందరూ ఉండి కూడా ఎవ్వరూ లేరు! తల్లి ఉన్నది, అన్న ఉన్నాడు, సోదరికంటేకూడా ముఖ్యమైన పార్వతి ఉన్నది—చంద్రముఖి ఉన్నది, అందరూ ఉన్నారు. కాని, నేనే ఎవరికీ కాను!' అని అనుకుంటూ ఉండేవాడు.

'అయితే తల్లిదగ్గరకే పోవటం స్థిరపరిచారా బాబూ?' అన్నాడు ధర్మ దాసు ఏడుస్తూ. దేవదాసు ముఖంచాటు చేసుకుని కళ్లు తుడుచుకున్నాడు.

'లేదు ధర్మా! తల్లికి ముఖం చూపించాలని లేదు. బహుశా ఆ ఘడియ ఇంకా రాలే దనుకుంటాను.'

వృద్ధ ధర్మదాసు వెక్కి-వెక్కి ఏడుస్తూ—'ఇంకా తల్లి బ్రతికే ఉందిగా బాబూ!' అన్నాడు.

ఈమాటలో ఉన్నధ్వని ఇద్దరూ పూర్తిగా గ్రహించారు.

దేవదాసు స్థితి నానాటికీ తీసికట్టుగా ఉన్నది. ప్లీహమూ కాలేయమూ పొట్టనంతా కమ్మివేసినవి; ఆ పైన దగ్గూ జ్వరమూ. శరీరం నల్ల బడింది. ఎముకలు లెఖ్ఖపెట్ట వచ్చును. కళ్ళు పీక్కుపోయినవి—కాని అస్వాభావిక మైన తెలుపుతో తళతళ మెరసిపోతున్నవి. తల వెంట్రుకలు పీచుమాదిరిగా లేచినవి—ప్రయత్నిస్తే లెఖ్ఖకూడా పెట్టవచ్చు. చేతి వేళ్ళ వంక చూస్తే అసహ్యంకూడా వేస్తున్నది—అసలే ఎండుకు పోయినవి; పైన పొడలు.

స్టేషను దగ్గరికి వచ్చినాక—'టిక్కెట్టు ఏక్కడికి తీసుకో మంటారు, బాబూ!' అని ధర్మదాసు అడిగాడు.

దేవదాసు కొంచెం ఆలోచించి—'ముందు ఇంటికి పోదాము పద, తర్వాత ఆలోచించుకోవచ్చు' అన్నాడు.

హుగ్లీకి టిక్కెట్లుతీసుకుని బండిరాగానే ఎక్కారు. ధర్మదాసు, దేవ దాసుదగ్గరే ఉన్నాడు. సాయంకాలానికి కళ్లు మంటలతోపాటు దేవ దాసుకు మళ్ళీ జ్వరం వచ్చింది.

'ఇక యింటికి చేరేదాకాకూడా నమ్మకంలేదు ధర్మా!' అన్నాడు దేవదాసు.

'అలా అంటారేం బాబూ!' అన్నాడు ధర్మదాసు భయపడుతూ.

దేవదాసు నవ్వు తెచ్చుకోవాలని వృధా ప్రయాసపడి—'మళ్ళీ జ్వరం వచ్చింది, ధర్మా' అన్నాడు.

రైలు కాశీదాటి ఇంకా కొంతదూరం పోయేవరకూ, దేవదాసు వళ్ళు తెలియకుండానే పడివున్నాడు. పాట్నా సమీపంలో అతనికి తెలివివచ్చింది.

'అనుకున్నంతా ఐంది ధర్మా. అమ్మను చూడటం నిజంగానే పడలేదు!' అన్నాడు దేవదాసు.

'ముందు పాట్నాలో దిగండిబాబూ, ఎవరన్నా డాక్టరికి చూపిద్దాం.'

'ఇక్కడ వద్దు ధర్మా, ముందు ఇంటికి పోదాం పద.'

బండి 'పాండువా' స్టేషనుకు వచ్చేవరకు తెల్లవారింది. రాత్రంతా వర్షం కురిసి అప్పుడే వెలిసిన లక్షణాలు కనపడుతున్నవి. దేవదాసు లేచినిలబడ్డాడు. ధర్మదాసు ఇంకా నిద్రపోతూ ఉన్నాడు. దేవదాసు నెమ్మదిగా అతని ముఖాన చెయ్యి పెట్టాడు, కాని అతన్ని లేపటానికి బిడియపడి మెల్లగా తలుపు తెరచి బండి దిగాడు. నిద్రిస్తూ ఉన్న ధర్మదాసుతో సహా బండి ముందుకు సాగింది.

వణుకుతూ వణుకుతూ దేవదాసు స్టేషనుదాటి, ఒక గుర్రపుబండి వాణ్ణి పిలిచి—'హాతీపోతాకు బండి కడతావా?' అని అడిగాడు.

వాడొకమాటు దేవదాసు ముఖంవంక చూసి, కాసేపు, దిక్కులు పరికించి — 'రాస్తా మంచిది కాదుబాబూ, వర్షాకాలంలో గుర్రపుబండి అక్కడికి పోలేదు.' అన్నాడు.

దేవదాసు ఉద్విగ్నుడై... 'పల్లకీ దొరుకుతుందా?' అని అడిగాడు.

'దొరకదు బాబూ!'

అయితే ఇక పోవటం పడదా? అనే సందేహంతో దేవదాసు కూర్చొబడినాడు. అతని ముఖంమీద, మృత్యుచిహ్నాలు అచ్చు గుద్దినట్టుగా కనబడుతున్నవి—గుడ్డివాడుకూడా చదవగలడు; బండివానికి జాలి వేసింది.

'ఎడ్లబండి మాట్లాడి పెట్టమంటారా, బాబూ?' అని అడిగాడు.

'ఎప్పటికి చేరుతుంది?'

'దోవ సరిగాలేదు బాబూ, రెండురోజులు పట్టుతుం దనుకుంటాను.

ఇంకా రెండురోజులదాకా నేను బ్రతికి ఉంటానా? అని దేవదాసు మనస్సులో గుణించుకున్నాడు; కాని అతను పార్వతిదగ్గిరికి పోక తప్పదు. చిన్నితనం నుంచీ అతను ఆమెతో ఆడిన అబద్ధాలన్నీ జ్ఞాపకం వచ్చినవి. కాని ఆఖరుతఫా అతను ఆమెకు యిచ్చిన మాట నెరవేర్చ వలసిందే; ఎలాగైనా

సరే, ఆమెను కడసారి చూపు చూడవలసిందే. కాని జీవితావధి సమీపించింది; ఇదే భయపడవలసిన విషయం!

దేవదాసు ఎడ్లబండి ఎక్కాడు. తల్లి జ్ఞాపకం వచ్చి అతని కళ్ల వెంట నీరు ధారగా కారింది. ఇంకో ముఖంకూడా ఈ అంతిమ దశలో అతనికి మహాపవిత్రంగా కనిపించింది—అది చంద్రముఖిది. పాపిష్ఠురాలని అతను ఎవరినైతే మొదటినుంచీ ఏవగిస్తూ వచ్చాడో, ఆమె ఈనాడు తల్లితోపాటు తలపుకు రావటం చూసి అతని కళ్ళ వెంట అశ్రువులు రాలినవి. ఇక ఈ జీవితంలో ఆమె కనపడదు. బహుశా చాలా కాలం వరకు ఆమె ఈ సంగతి తెలుసుకోలేదు. అయినా అతను పార్వతి దగ్గరికే వెళ్ళాలి! ఇంకోమాటు కనపడతానని అతను మాట ఇచ్చాడు! ఈ మాట తప్పకూడదు; నెరవేర్చవలసిందే!

డొంక బాగా లేదు. వర్షపు నీరు అక్కడక్కడ గుంటల్లో నిల్చి ఉన్నది. ఎక్కడన్నా గళ్ళుకూడా పడినవి. దోవంతా బురద. బండి పూటీల వరకూ దిగబడుతూ ఉన్నది. అప్పుడప్పుడూ బండివాడు దిగి చక్రం ఎత్తివేయవలసి వస్తున్నది; ఎడ్ల తోకలు మెలి వేసి నిర్దయగా కొట్టవలసి వస్తున్నది. ఎన్ని తంటాలు పడైనా సరే, ఈ పదహారు కోసులూ దాటాలి!

రయ్ మని చలి గాలి వీస్తూ ఉన్నది. ఇవ్వాళ సాయంత్రంకూడా దేవదాసుకు బాగా జ్వరం వచ్చింది. అతను భయపడుతూ—'అబ్బీ ఇంకా ఎంత దూరం ఉంది?' అని అడిగాడు.

'ఇంకా పది కోసు ఉంది బాబూ!'

'త్వరగా తీసుకెళ్లు నాయనా! ఎంత డబ్బయినా ఇస్తాను' అని జేబులో నుంచి వంద రూపాయల కాగితం ఒకటి తీసి — 'వంద రూపాయలిస్తాను దబ్బున చేర్చు' అన్నాడు.

తర్వాత దేవదాసుకు ఆ రాత్రి ఏవిధంగా గడిచిందో తెలియ లేదు. ఒళ్ళు తెలియకుండా పడిపోయినాడు. ఉదయం తెలివి రాగానే—'అబ్బీ, ఇంకా ఎంత దూర ముంది?' అని అడిగాడు.

'ఇంకా ఆరు కోసులు బాబూ!'

దేవదాసు నిట్టూర్చి—'కాస్త త్వరగా తీసుకెళ్ళు నాయనా, నా కిక వ్యవధి లేదు. గడువు సమీపించింది' అన్నాడు.

బండివానికి ఏమీ అర్థం కాకపోయినా, నూతనోత్సాహంతో ఎడ్లను బూతులు తిడుతూ అదలింప నారంభించాడు. ఎడ్లు శక్తి కొలదీ నడుస్తున్నవి! లోపల దేవదాసు మహా వ్యాకులపడుతున్నాడు. అతనికి ఒకటే ఆలోచన— చూడటానికి పడుతుందా? చేరగలనా? అని.

మధ్యాహ్నం బండివాడు బండిని ఆపి ఎడ్లను విప్పి మేత వేశాడు. చద్ది మూట విప్పి తాను భోంచేయటానికి కూర్చుని 'బాబుగారూ, మీరేమీ తినరా?' అని దేవదాసును అడిగాడు.

'తినను అబ్బీ, కాని చాలా దాహం వేస్తున్నది. కాసిని మంచినీళ్లు తెచ్చి పెట్టగలవా?'

బండివాడు డొంక పక్కన ఉన్న చెరువుకుపోయి నీళ్ళు తెచ్చియిచ్చాడు.

ఇవ్వాళ సాయంత్రం జ్వరంతోపాటు దేవదాసు ముక్కులోనుంచి ఒక్కొక్క బొట్టు నెత్తురుకూడా పడ నారంభించింది. అతను ప్రాణాలన్నీ ఒడ్డి ముక్కు బిగించి పట్టుకున్నాడు. తర్వాత పళ్ళ చిగుళ్ళలోనుంచి రక్తం రావటానికి ప్రయత్నిస్తున్నట్టుగా అతనికి తోచింది. కొంచెం ఎగశ్వాసకూడా పుట్టింది.

దేవదాసు ఆయాసంతో—'ఇంకా ఎంత దూరముంది?' అని బండివాణ్ణి అడిగాడు.

'ఇంకా రెండు కోసులు, రాత్రి పది గంటలకు చేరుతాము.'

దేవదాసు చాలా కష్టంతో తల ఎత్తి దోవవంక చూసి—'భగవంతుడా!' అన్నాడు.

'ఎందుకలా అంటారు బాబూగారూ?' అన్నాడు బండివాడు.

దేవదాసు ఈ ప్రశ్నకు జవాబివ్వలేక పోయినాడు. బండి సాగి పోతూనే ఉన్నది. కాని అతను చెప్పినట్టు పది గంటలకు కాకుండా రాత్రి పన్నెండు గంటలకు హాతిపోతా జమీందారుగారి దేవిడీ ముందున్న రావిచెట్టు క్రింద ఆగింది.

'దిగండి బాబూగారూ !' అని బండివాడు దేవదాసును పిలిచాడు.

జవాబులేదు. మళ్ళీ పిలిచినా మారులేదు. అప్పుడు వాడు భయపడి దేవదాసు ముఖం దగ్గరికి దీపం తీసుకువచ్చి—'నిద్ర పోతున్నారా బాబుగారూ !' అన్నాడు.

దేవదాసు చూస్తూనే ఉన్నాడు. పెదవులు కూడా కదిలించాడు. కాని మాట మాత్రం బయటికి రాలేదు.

'ఓ బాబుగారూ !' అన్నాడు మళ్ళా బండివాడు.

దేవదాసు చెయ్యి ఎత్తాలను'కున్నాడు; కాని లేవలేదు. అతని కను కొలకుల వెంట రెండు అశ్రు బిందువులు జారినవి. బండివాడు అప్పుడు తన బుద్ధి నంతా వినియోగించి రావిచెట్టు చుట్టూ కట్టిన దిమ్మెమీద గడ్డితో పక్క పరిచాడు. తర్వాత చాలా ప్రయాసతో దేవదాసును ఎత్తి దానిమీద పండుకోబెట్టాడు.

బయట ఒక పురుగుకూడా లేదు. జమీందారుగారి ఇల్లు, నిశ్శబ్దంగా నిద్రిస్తూ ఉంది. దేవదాసు మహా కష్టంతో జేబులోనుంచి వందరూపాయల కాగితం తీసి బండివానికి ఇచ్చాడు. దేవదాసు తన వంక నే చూస్తూఉండటం, ఆ లాంతరు వెలుతురులో బండివాడు చూశాను. కాని అతనేమీ చెప్పలేకుండా ఉన్నాడు. అతని స్థితి గ్రహించి బండివాడు నోటు బొడ్డున కట్టుకున్నాడు; శాలువా దేవదాసు రొమ్మువరకూ కప్పినాడు. లాంతరు, ఎదుటనే వెలుగుతూ ఉంది. కొత్త మిత్రుడు దేవదాసు కాళ్లదగ్గర కూర్చుని ఆలోచిస్తున్నాడు.

తెల్లవారింది. జమీందారు ఇంట్లోనుంచి మనుష్యులు బయటకు వచ్చి ఈ దృశ్యం చూసి విస్తు పోయినారు:—చెట్టుక్రింద ఎవరో మనిషి చనిపోతున్నాడు. ధనవంతుడు ! ఒంటిమీద విలువగల శాలువా, కాళ్ళను తళ తళ మెరిసే బూట్లూ ! ఒక్కరొక్కరే చాలామంది పోగయారు. క్రమంగా ఈ సంగతి భువనబాబు చెవిదాకా పోయింది. ఆయన డాక్టరుకు కబురు చేసి అక్కడకు వచ్చాడు.

దేవదాసు ఒక్క మాటు అందరి వంకా చూశాడు. కాని అతనికి మాటలు పడిపోయినవి. ఏమీ చెప్పలేక పోయినాడు. కళ్ళ వెంట మాత్రం నీరు కారుస్తున్నాడు. బండివాడు తనకు తెలిసినంత వరకు చెప్పాడు కాని అందు వల్ల ఏమీ ఆచూకీ చిక్క లేదు.

ఇంతలో డాక్టరువచ్చి—'ఎగశ్వాస పుట్టింది, ఇక లాభం లేదు' అని తేల్చాడు.

'అయ్యో, పాపం!' అన్నారు అక్కడ ఉన్న వారంతా.

మేడపైన కూర్చున్న పార్వతి కూడా ఈ సంగతి విని—'అయ్యో పాపం!' అన్నది.

ఏవరో పుణ్యాత్ముడు దయదలచి దేవదాసు నోట్లో ఒక నీటిబొట్టు వేశాడు. దేవదాసు అతని వంక కరుణా దృక్కులతో చూశాడు. అంతే, ఆ తర్వాత కళ్ళు మూయటం ఇక తెరవనే లేదు.

ఇక ఎవరు దహనం చెయ్యాలి అనే ప్రశ్న కలిగింది. ఎవరు అంటు కుంటారు? ఏ జాతి అనే సమస్య మీద కాసేపు చర్చ జరిగింది. భువనబాబు దగ్గర ఉన్న పోలీసు స్టేషనుకు కబురు చేశాడు. ఇన్‌స్పెక్టరు వచ్చి రిపోర్టు రాసుకో నారంభించాడు.

ప్లీహం, కాలేయం పెరగటంవల్ల మృత్యువు; ముక్కూ నోటా నెత్తురు డాగులు; జేబులో రెండు ఉత్తరాలు దొరికినవి. ఒకటి తాల్‌సోనాపురంలో ఉన్న ద్విజదాసు ముఖర్జీ బొంబాయిలో ఉన్న దేవదాసు ముఖర్జీకి రాశాడు- 'ఇక డబ్బు పంపటం అసంభవం' అని, రెండవది కాశీలో ఉన్న హరిమతీదేవి దేవదాసు ముఖర్జీకి, 'ఎలా వున్నావు?' అని రాసింది. కుడిచేతిని అతని పేరు ఇంగ్లీషు పొడి అక్షరాల్లో పచ్చ పొడిచి ఉన్నది. ఇన్‌స్పెక్టరు ఇవన్నీ పరీక్షించి, అతను తప్పక దేవదాసే నని తేల్చాడు.

వ్రేలిని ఒక నీలం తాపిన ఉంగరం—ధర షుమారు 150 రూపాయలు, శాలువాలు రెండు—ధర రెండువందల రూపాయలు, ఇంకా చొక్కా- ధోవతీ—ఇన్‌స్పెక్టరు ఇవన్నీ లెక్క రాసుకున్నాడు.

భువనబాబూ మహేంద్రుడూ అక్కడనే ఉన్నారు. తాల్‌సోనాపురం

మాట విని మహేంద్రుడు—'పిన్నిది ఆ ఊరే. ఆమె చూస్తే—'అన్నాడు.

'ఇక్కడ శవాన్ని గుర్తించటానికి వస్తుందా. ఏమిటి మీ పిన్ని ?' అని భువనబాబు మహేంద్రుని గద్దించాడు.

'చాదస్తుడంటే ఇలాంటివాడే!' అన్నాడు ఇన్‌స్పెక్టరు నవ్వుతూ.

బ్రాహ్మణుని శవమైనా ఆపల్లెటూళ్లో అగ్రజాతుల వారెవరూ దహనం చేయటానికి ఇష్టపడ లేదు, వెట్టివాళ్లు వచ్చి కట్టుకు పోయారు. వాళ్ళు ఆ శవం సరిగ్గా తగలబడక ముందే వదలిపెట్టి వెళ్ళిపోయారు. కాకులూ, గద్దలూ వచ్చి శవం మీద వాలినవి. కుక్కలూ నక్కలూ శవం కోసం కీచులాడినవి. అప్పుడు కూడా విన్న వాళ్ళంతా 'అయ్యో పాపం!' అన్నారు.

దివాణంలో ఉన్న దాస దాసీ లందరూ ఈ సంగతే చెప్పుకో నారంభించారు:

'అయ్యో పాపం, కులీనుడు, ధనవంతుడు, రెండువందల రూపాయల శాలువాలూ, నూటయాభైరూపాయల ఉంగరం. అన్నీ ఇన్‌స్పెక్టరుగారి దగ్గరే ఉన్నాయి. ఉత్తరాలు రెండూకూడా వారే తీసుకు వెళ్ళారు.'

ఈ సంగతి పార్వతికి ఉదయమే తెలిసింది. కాని ఇప్పుడామె ఏ విషయంలోనూ అంతగా కుతూహలం చూపించటం లేదు; అందువల్ల వివరాలు తెలుసుకోలేదు. కాని ప్రతివాళ్ళ నోటా ఈ మాట వింటూ ఉండటం చేత పార్వతి సాయంత్రం ఒక దాసీని పిలిచి—'ఏమిటే సంగతి? చచ్చింది ఎవరు?' అని అడిగింది.

'అయ్యో! ఎవరికి తెలుసు తల్లీ, పూర్వజన్మలో ఈగడ్డను కొని ఉంటాడేమో' అందుకనే ఇక్కడకు మట్టి కావడానికి వచ్చాడు. చలిలో మంచులో రాత్రంతా ఇక్కడే పడి ఉన్నాడు. ఇవ్వాళ తొమ్మిది గంటలకు చచ్చిపోయాడు.'

పార్వతి నిట్టూర్చి—'అయ్యో పాపం! ఇంతకూ అతనెవరో తెలియనే లేదా ?' అని అడిగింది.

'చిన్నబాబు గారికి అంతా తెలుసును. నాకు బాగా తెలియదమ్మా.

మహేంద్రునికి కబురు చేస్తే అతను వచ్చి—'మా ఊరువాడే. దేవదాసు ముఖర్జీ' అని చెప్పాడు.

పార్వతి మహేంద్రుని దగ్గరకు వచ్చి అతనివంక తీవ్రంగా చూస్తూ—'ఎవరూ? దేవదాదా? ఎలా తెలుసుకున్నావ్?' అన్నది.

'జేబులో రెండు ఉత్తరాలు దొరికాయి. ఒకటి ద్విజదాసు ముఖర్జీ రాశాడు—'

'ఆఁ. అతను అన్న' అన్నది పార్వతి మధ్యనే అడ్డి.

'ఇంకో ఉత్తరం కాశీనుంచి హరిమతీదేవి రాసింది—'

'ఆఁ. ఆమె తల్లి.'

'చేతిమీద పేరు పచ్చ—'

'ఆఁ. మొట్టమొదట కలకత్తా వెళ్ళినప్పుడు పొడిపించుకున్నాడు.'

'వేలిని ఒక నీలం ఉంగరం—'

'ఆఁ, వడుగునాడు పెదబాబు ఇచ్చాడు. ఇక నేను వెళ్తాను?' అంటూ పార్వతి చకచక పైనుంచి దిగింది. మహేంద్రునికి ఏమీ పాలు పోలేదు.

'పిన్నీ యెక్కడకు వెళ్ళుతున్నావు?' అని అడిగాడు.

'దేవదాసు దగ్గరకు.'

'అతను లేడు. ఎప్పుడో వెట్టివాళ్ళు తీసుకువెళ్ళారు.'

'అమ్మో, నాయనో!' అని అరుస్తూ పార్వతి పరుగెత్త నారంభించింది. మహేంద్రుడు అడ్డి—'నీ కేమన్నా పిచ్చా, అమ్మా! ఎక్కడికి వెళ్తావు?' అన్నాడు.

పార్వతి మహేంద్రునివంక తీక్ష్ణంగాచూసి-'మహేన్! నేను పిచ్చిదాన్ని అనుకొంటున్నావా? దోవ వదులు' అని గద్దించింది.

ఆమె కళ్లుచూసి మహేంద్రుడు దోవ వదిలి ఆమె వెనువెంటనే పో నారంభించాడు. పార్వతి బయటకు వచ్చేసింది. అప్పుడు కచ్చేరీలో గుమాస్తాలూ ముసద్దీలూ, ఇంకా పనిచేస్తూనే ఉన్నారు. వాళ్లంతా ఈమెను చూశారు. చౌదరిగారుకూడా కళ్ళజోడు పైనుంచి చూసి —'ఎవరా వెళ్లేది?' అని అడిగాడు.

'పిన్ని' అన్నాడు మహేంద్రుడు.

'అదేమిటి! ఎక్కడికి పోతున్నది?'

'దేవదాసును చూడటానికి.'

'మీ అందరికీ పిచ్చి ఎక్కిందా ఏమిటి? పట్టుకోండి, పట్టుకోండి. పిచ్చి ఎక్కింది! ఓ మహేన్!' అని భువన చౌదరి చీత్కారం చేశాడు.

తర్వాత దాసదాసీలందరూ కలిసి పార్వతి మూర్ఛిత దేహాన్ని ఇంట్లోకి తీసుకుపోయారు. పార్వతికి మర్నాడు స్మృతి వచ్చింది. కాని యెక్కువ మాట్లాడలేదు. ఒక దాసీని పిలిచి—'రాత్రి రాలేదా? రాత్రంతా!' అని మాత్రం అడిగింది.

అంతే. పార్వతి ఇక మాట్లాడలేదు.

* * *

ఇప్పుడు, ఇంతకాలమైనాక పార్వతి ఏమయిందో యెలా ఉన్నదో నాకు తెలియదు. తెలుసుకోవాలనే కోరికకూడా లేదు నాకు. దేవదాసునుగురించే నాకు చాలా దుఃఖంగాఉంటుంది. ఈ కథ చదివితే, బహుశా, మీకు కూడా నా మాదిరిగానే దుఃఖం కలగవచ్చు. అయినా, దేవదాసువంటి దౌర్భాగ్యులతో, నిగ్రహం లేనివారితో, పాపిష్ఠులతో యెప్పుడైనా మీకు పరిచయం కలిగితే, వాళ్ళకోసం మీరు కొంచెం ప్రార్థించండి. కనీసం అతనివంటి చావు మాత్రం యెవ్వరికీ రాకూడదని కోరండి! మరణంవల్ల పెద్ద నష్టమేమీ లేదు. కాని, ఆ సమయంలో ప్రేమపూరితమైన కరస్పర్శ లలాటానికి సోకాలి; ఆఖరికి, ఒకటైనా కరుణాపూరితముఖాన్ని చూస్తూ ఈ జీవితం అంతం కావాలి; చివరికి ఒక్కరి కంటినుంచైనా కన్నీటిబిందువు రాలటం చూసి ప్రాణాలు వదలాలి. చాలు, ఇంతకంటే పెద్దకోరికలు అనవసరం!

# మా ఏజంట్లు

| | | |
|---|---|---|
| వెంకటరామా అండ్ కో. | ... | మద్రాసు, బెజవాడ, తెనాలి, రాజమండ్రి, గుంటూరు, సికిందరాబాదు, కర్నూలు, తాడేపల్లిగూడెం ఏలూరు. |
| గుప్త బ్రదర్స్ | ... | విశాఖపట్టణం. విజయనగరం |
| కాకినాడ | ... | రామమోహన్ అండ్ కో. వి. తిరపతయ్య |
| రాజమండ్రి | ... | ఈశ్వర బుక్ డిపో. ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ. |
| ఏలూరు | ... | ది నేషనల్ బుక్ డిపో. |
| బెజవాడ | ... | పి. ఆర్. అండ్ సన్సు. మోడరన్ న్యూస్ ఏజన్సీ. వెరైటీ న్యూస్ ఏజన్సీ. |
| గుడివాడ | ... | మూర్తి బ్రదర్స్. |
| బందరు | ... | మినర్వా బుక్ డిపో. |
| గుంటూరు | ... | రావు బ్రదర్స్. |
| తెనాలి | ... | ది న్యూ వెరైటీ ఏజన్సీస్. ఆంధ్రా బుక్ డిపో. |
| అనంతపురం | ... | ఏ. కృష్ణమూర్తి. టి. నాగిరెడ్డి |
| హైదరాబాద్ | ... | ఆంధ్రా బుక్ హౌస్. |
| బరంపురం | ... | జూపిటర్ న్యూస్ ఏజన్సీ. |

# క్రొత్త ప్రచురణలు

కొడవటిగంటివారి నవల

బెంగాలీ కథల సంపుటి

మా. గోఖలేగారి కథలు

దువ్వూరి రామిరెడ్డిగారి కావ్యము

చలంగారి నాటకం

యువ బుక్ డిపో    మద్రాసు & తెనాలి

*YUVA ......*
*PUBLICATION*

*... DEVADOSS*
*by SARATBABU*